# మహారుద్రము



పైడిపాటి సుబ్బరామశాస్త్రి

PYDIPATI PUBLICATIONS
PYDIPATI NAGAR
V I J A Y A W A D A - 520 004



# M A H A R U D R A M U

(Poems)

By

PYDIPATI SUBBARAMA SASTRY

First Edition : NOV. 1983

**PRICE Rs. 5-00**

Stockist

PYDIPATI UMANADHA SARMA
Bharathi Nikethan
Subbaramasastry Street,
V I J A Y A W A D A - 4

## శ్రీ వేమూరి శ్రీరామ శాస్త్రి

లలి మీఱన్, విజయేశ్వరాలయముపై
రక్తిం బ్రదర్శించి, తా
వెలికిందెచ్చె బ్రశస్తి నెంతయును నా
"వేమూరి శ్రీరామ శా
స్త్రి", లలామంబుగ దాని సొంపలరగా
శ్రేయమ్మునుం గోరి, దా
తలునుం దీర్చిరి నేడు వైభవమునం
దన్, దానినిం దీక్షయై.

## శ్రీ మల్లాది కుటుంబరావు

వేదమునందునన్, మఱియు
పెద్దలయందున, భక్తిగల్గు, మ
ల్లాది కుటుంబరావు" తపు
లన్, విజయేశ్వరునందు భక్తి,నా
రాధన పూర్వకమ్ముయి చి
రమ్ముగ నిల్చెడి నాదు కబ్బమున్
బ్రోదియొనర్చె, వెల్గు లెగ
బోయగ, దేశమునందుఁ జెల్లగన్

# కృష్ణా స్తవము

శుద్ధ స్ఫటిక సంకాశాం, ద్విభుజాం, పద్మ ధారిణీమ్
శివమూర్తి ధరాం దేవీం, కృష్ణాం, త్వాం, ప్రణతోస్మ్యహమ్ 1

కమండలు ధరాం దేవీం, జపమాలాధరాం, శుభామ్
బ్రాహ్మీం,సుపర్ణ వర్ణాభాం, కృష్ణాం, త్వాం, ప్రణతో స్మ్యహమ్ 2

శంఖ చక్ర గదా పద్మ ధారిణీం, విష్ణు రూపిణీమ్,
ఇంద్ర నీల సమప్రఖ్యాం, కృష్ణాం, త్వాం, ప్రణతోస్మ్యహమ్ 3

స్మరణాత్సర్వ దోషఘ్నీం, దర్శనాత్, స్వర్గ దాయినీమ్
స్నానేన ముక్తిదాం, పుణ్యాం, కృష్ణాం, త్వాం ప్రణతోస్మ్యహమ్ 4

సర్వదేవ మయీం, సాక్షాత్, బ్రహ్మ విష్ణు శివాత్మికామ్
ఫలదాం సర్వతీర్థానాం, కృష్ణాం, త్వాం, ప్రణతోస్మ్యహమ్ 5

సహ్య పాదోద్భవే, దేవి, శ్రీశైలోత్సంగ గామిని
కృష్ణవే ణీతి విఖ్యాతా, మమ పాపాం వ్యపోహతు 6

సహ్య పాదోద్భవా, దేవీ, కృష్ణవేణీతి విశ్రుతా
సర్వపాప విశుద్ధ్యర్థం. స్నాస్యే దేవి, తవాంభసి 7

తటస్థ ముద్ధృతం క్షిప్తం జంతుం స్పృశతి వాయునా
కృష్ణవేణీ జలం హన్తి, పాపం, జన్మ శతార్జితమ్ 8

ప్రసీద మే దేవి సదా వరేణ్యా, దేవేశ సృష్టా జగతాం విముక్త్యై
స్నానేన యస్యా మపఘాత పాపః, ప్రాప్నోతి విష్ణోః పద మేవ మర్త్యః 9

బ్రహ్మామృతానంద రసేనపూర్ణా, జలేన పూర్ణామితి మేనిరేఽజ్ఞాః
తాం, త్వావగాహామి పిబామి కృష్ణే, దేవాన్ ఋషిన్ తర్ప యిష్యే పితౄంశ్చ 10

# ప్రవేశిక

"కావేరీ తుంగభద్రాచ, కృష్ణవేణీచ గౌతమీ, భాగీరథీచ విఖ్యాతా, పంచగంగాః ప్రకీర్తితా." ఈ పంచగంగలలోనను "త్రిసప్తేవమహానద్యః, కృష్ణా గోదాచ జాహ్నవీ, తస్మాత్తాసు ప్రయత్నేన, స్నానం కుర్యా ద్విచక్షణః" అన్నట్లుగా, కృష్ణా, గోదావరీ, భాగీరథులే మహానదులు. అయినను, " గంగేచ యమునే కృష్ణే, గోదావరి సరస్వతి. నర్మదే సింధు కావేరి, జలే స్మిన్ సన్నిధిం కురు" అని మఱికొన్ని పవిత్రనదుల జలములు సన్నిహితమగుటకు స్నానవేళ స్మరింతురు. కొందరు గంగా సింధుశ్చకావేరీ, యమునాచ సరస్వతీ, రేవా మహానదీ గోదా, బ్రహ్మపుత్రా పునాతు మామ్— అని, ప్రభాతవేళ ప్రార్థింతురు. పుష్కరప్రవేశమున్న నదులు, గంగ, నర్మద, సరస్వతి, యమున గోదావరి, కృష్ణ, కావేరి, భీమరధి, బ్రహ్మపుత్ర, తుంగభద్ర, సింధు, ప్రణీత—నదులు మాత్రమే. కృష్ణానదితోపాటు, దాని యుపనదులైన భీమరథి, తుంగభద్రలకు కూడ పుష్కర ప్రవేశ ముండుట యొక విశేషము. ఉత్తరదేశమున పుష్కరప్రవేశమున్న గంగా యమునా సరస్వతులు పృథగ్నదులై కూడిన చోటొక విశేషము కాగా, దక్షిణదేశమున పుష్కర ప్రవేశమున్న రెండు ఉప నదులున్న నదియొకేనది అగుట,అది కృష్ణయగుటయొకవిశేషము. నదులలో నగ్రజయగుట దానికి కారణము కావచ్చును.

## నదులలో అగ్రజ

నదీనామగ్రజననా న్మాహాత్మ్యాచ్చమహత్వతః, సర్వంకర్షతి చాఘౌఘం తేన కృష్ణా ప్రకీర్తితా— అని యీశ్వరవచనము.

నదులలో అగ్రగజ, సర్వపాపకర్షిణి యగుటచే, కృష్ణ అనియు యీశ్వరవచనము. ఒకమారు విష్ణుపాదము సోకుటచేతనే గంగ పవిత్రతఁజెందె స్మరణముచేతనే మోక్షదాయి యగుచుండగా సాక్షాద్విష్ణుశరీరిణయై కృష్ణానది మహిమనెట్లుగా చెప్పగలమని యీశ్వరుడు స్కందునితో చెప్పెను. "యేయం దక్షిణతో గంగా సా దేవీ ప్రసీదతు" అని మార్కండేయుడు కృష్ణను దక్షిణ గంగగా కీర్తించెను. "కృష్ణవేణీ నదీనామ యత్రయత్రైవగచ్ఛతి, స్నాతస్యత్రతత్రైవ శతధేనుఫలం లభేత్— పౌర్ణమాస్యా మమాయాంచా, వ్యష్టమ్యాం చంద్రసూర్యయోః, గ్రహణేస్నాన మాత్రేణ, గోసహస్రఫలం లభేత్—నదీనాముత్తమావేణీ దేవానాముత్తమో హరిః, విద్యానాముత్తమోవేదో, వర్ణానాంవిప్ర ఉత్తమః" అని గౌతముడు దాల్భ్యుని కుపదేశించునట్లుగా స్కంద పురాణ ప్రమాణము.

నర్మదాతీరమునందు తపస్సు, కురుక్షేత్రమున దానము, కాశిలో మరణమునకు కలుగు ఫలితమువలెనే, పుష్కరకాలముల కృష్ణాస్నానము మోక్షదమని పద్మపురాణము చెప్పుచుండగా, "బ్రహ్మజ్ఞానం గయాశ్రాద్ధం, దానంచ కురుజాంగలే, కృష్ణవేణీ పయః పానం, సమ మేతచ్చతుష్టయమ్" అని యింకొక పురాణము చెప్పుచున్నది. "విష్ణుపాదోర్భవా గంగా, అపరా దేహసంభవా, ఏకత్ర శస్యతే స్నానం,పానమేకత్ర శస్యతే" గంగ విష్ణువు పాదమునందును, కృష్ణ దేహమునందును ప్రభవించినవి. మొదటి దానియందు స్నానము విశేషముకాగా, రెండవదాని యందు పానము ప్రశస్తము. "షష్టిర్వర్షసహస్రాణి, భాగిరథ్యవగాహనం, కృష్ణవేణీ నదీస్నానం, సమంకన్యాగతేఽహా", అఱువదివేల సంవత్సరములు గంగాస్నానము చేసిన ఫలితము పుష్కరసమయములో కృష్ణాస్నానము వలన కలుగును.

## త్రిమూర్త్యాత్మకము

ఈశ్వరుని యష్టతనువులలో జలమొకటి. కనుక కృష్ణవేణి శివాత్మకము. విష్ణుస్వరూపిణియగుటచే విష్ణ్వాత్మకము, విష్ణువు నుండి బ్రహ్మపుత్రిగా స్వీకరించుటచే బ్రహ్మాత్మకము, కనుక కృష్ణానది త్రిమూర్త్యాత్మకమని యొకమతము. ఇంతకంటె సుస్పష్టమైన విషయమొకటియున్నది.

బ్రహ్మ, సహ్యాద్రియందు, దీక్షితేయేష్టిని చాక్షుష మన్వంతరములోచేయ సంకల్పింపగా, సరస్వతి ముహూర్తసమయమునకు రాకపోగా, సదస్యులు గాయత్రియను కన్యను వివాహమొనర్చి సకాలమున యజ్ఞము చేయింపబూనిరి, ఆలస్యముగా వచ్చిన సరస్వతి, కోపించి వారిని జడస్వరూపమున నదీనదములగునట్లు శపించెను, "తత్ర విష్ణురభూత్ కృష్ణా, వేణీ దేవో మహేశ్వరః, బ్రహ్మ కకుద్మతీచాపి, పృథగేవాచరన్నృప — దేవాః స్వానపితా నంశాన్, జడీకృతాన్ విచిక్షపుః, సహ్యాద్రిశిఖరేఽభ్యస్తే, పృథగ్భూ తాశ్చనిమ్నగాః." అనుటచేత, వేణీనది మహేశ్వరాంశ యనియు బ్రహ్మ కకుద్మతి యయ్యెననియు తెలియుచున్నది.

## సర్వతీర్థములకు మాత

కృష్ణావతరణ మొక గొప్ప సంఘటనము. విష్ణువు బ్రహ్మతోనిట్లు చెప్పెను. "గంగాద్యాశ్చమహానద్యో, నదాః ప్రస్రవణానిచ, వివిధానిచతీర్థాని, సృజత్వం పూర్వవద్భువి, మాతరం సర్వతీర్థానాం, నదీనా మగ్రజత్వహం, ప్రసక్ష్యామి పూర్వవత్కృష్ణాం, మన్మయీం జగతాంస్థితేః" కనుక గంగాదినదులకు పూర్వమే కృష్ణ విష్ణువుచే సృజింపబడి బ్రహ్మకు దత్తముచేయుబడెను. మిగిలిన గంగాది తీర్థములు బ్రహ్మసృష్టి. అందుచేత కృష్ణానది స్వరూపమే విశిష్ట

మైనది. ఆమె దివ్యస్వరూపిణి, విశాలలోచన, శ్యామలవర్ణ, విష్ణు చిహ్నాంక, చతుర్బాహు సమలంకృత, పీతాంబరధారిణి, లావణ్య రసాధిదేవత. "మాహాత్మ్యమస్యాస్సకలం, మనంతం కోవదిష్యతి, సురభి ర్దివిలోకవిశ్రుతా, భువి కృష్ణే ష్టపర్వపూరణే, సురభేరియ మేవచాధికా, స్వజనేభ్యోఖిలధర్మమోక్షదా" అనుటచే నీనది, కామధేనువుకన్న మిన్న. దీనిని తెలియుటకర్హులు కానివారిగా "నాస్తికాదాంభికాశ్చాత్ర హైతుకా విషయాత్మికాః కాకాఇవామృతే దివ్యేనయోగ్యా విబు ధోచితే" అనుటలో కొందరు పేర్కొనబడిరి. వేదములలో ఋగ్వేద సంహితవలె, తీర్థములలో కృష్ణవేణి యుత్తమమని విష్ణువచనము.

## కృష్ణావతరణము

శ్రీ మహావిష్ణువును గూర్చి సహ్యముని పర్వతాకారుడై మోక్షమునకై తపమాచరించుచుండెను. విష్ణువు రూపచతుష్టయములో నొకటైన ప్రద్యుమ్నాంశతో, బ్రహ్మతో కృష్ణతో దేవతలతో వచ్చి, సహ్యమునిని దేవ్యాగమన మహోత్సవ సందర్భమున వరము కోరుకొమ్మనిరి. అతడు మోక్షసిద్ధికై కృష్ణను, విష్ణువును తనపై వసింపుమని కోరుకొనెను. కృష్ణానది, సహ్యజా నామమే తనకు ప్రియతమము కాగలదనియు, ననుజన్మలై ఇతర నదులును, సహ్యాద్రినుండి పుట్టగలవనియు వరమిచ్చెను. విష్ణువు పర్వతముపై శ్వేతాశ్వత్థరూపుడుకాగా, మూలమునుండి పుణ్యజల పూర్ణయై, కృష్ణయందు ప్రవేశించెను.

కొంతకాలమునకు బ్రహ్మ విష్ణు నారాధింపగా, విష్ణువు ప్రత్యక్షముకాగా, తరుమధ్యము నుండి

తన కమండలమునయున్న సర్వతీర్థయుతమగు విరజానదీ జలమున హరిపాదప్రక్షాళనముచేసి, యీయుదక మక్షయము చేయుమని ప్రార్థింప, విష్ణువు తనయందలి యమృతము నందు పొదిపి నదీ రూపమున ప్రవహింపజేసెను. ఇట్లు తనకు సరస్వతీ శాపానుభవ మునకు స్థితిని కల్పించుకొనెను. అట్లు సర్వతీర్థస్వరూపిణిగ కృష్ణానది మహారాష్ట్ర ప్రదేశమున మహాబలేశ్వర క్షేత్రమున భూమికి దిగెను. గోముఖమునుండి ప్రవహించెను. బ్రహ్మ శిఖరమున కుత్తరమున వేదగిరి శిఖరమున నమలకవృక్ష రూపియైన శివుని నుండి వేణీనది ప్రవహించి "సతారా" ప్రాంతమున కృష్ణలో కలియుగా, నా కృష్ణవేణిని, బ్రహ్మ శిఖరమునకు కొంచెము దక్షిణమునుండి బ్రహ్మాంశమున ప్రవహించు కకుద్మతి కలిసెను. వింధ్యారణ్యము నుండి లక్ష్మీదేవ్యంశమున చంద్రభాగ, భీమగతి రథవేగమున వచ్చి "భీమరథి" యను నామాంతరమును పొందెను. కాగా కృష్ణా నది త్రిమూర్త్యాత్మకమై లక్ష్మీప్రద మయ్యెను.

## నదీగమనము

పడమటి కనుమలనుండి కృష్ణవేణి ప్రవహించుట మొదలిడి సాగరమున కలియు వఱకును నున్న పొడుగు సుమారు 785 మైళ్ళు. దైర్ఘ్యమున తక్కువైనను, ప్రభావమున, మిగిలిన రెండు మహానదుల కన్నను మిన్న. తన గమనముచే సాగర పర్యంతము నెన్నియో ప్రదేశములకు తీర్థత్వము కల్పించిన దీ మహానది. నూట ముప్పది యెనిమిది తీర్థములు మిక్కిలి ప్రసిద్ధములు. ఈనదికి (1) వేణి (2) కకుద్మతి (3) మలాపహారిణి (4) విశాల

(5) విజయ (6) వైష్ణవి (7) కుముద (8) నారాయణి (9) కౌశికి (10) భీమరథి (11) అత్ని (12) తుంగ (13) భద్ర (14) మూసీ యనబడు ముచికుంద – ఉపనదులు. "భద్ర" ను కలుపుకున్న తుంగ, తుంగభద్రయై కర్ణాటకము నుండి కర్నూలు వరకు ప్రవహించి, శ్రీశైల పశ్చిమద్వారమగు "అలంపురి" సమీపములో కృష్ణవేణిని కలియుగా, తెలంగాణా ప్రాంతమున పుట్టిన ముచుకుంద కృష్ణవేణిలో కలిసిన చివరి యుపనది. వ్యాఘ్రేశ్వర క్షేత్ర సమీపమున [పులిగడ్డ] కృష్ణానది, వేణీనది నుండి విడివడి, 'హంసలదీవి' యొద్ద సముద్రుని కలియుగా, వేణీనది మోరుతోట వద్ద సాగరుని చేరెను. రెండిటిమధ్య సీమ "దివిసీమ" యాయెను. మొత్తముమీద మహారాష్ట్రములో పుట్టిన కృష్ణానది, కర్ణాటకాంధ్ర రాష్ట్రములను గూడ పునీతము చేయుచున్నది.

## కొన్ని తీర్థములు

కృష్ణవేణి సంగమ స్థానములు, కకుద్మతీ సంగమ స్థానము, మార్కండేయ తీర్థము సర్వసిద్ధికరములు. కుబ్జేశ్వరతీర్థ సమీపమున మహాతీర్థమున దీక్షతో స్నానమాచరించిన, దివ్యదృష్టి కలిగి బ్రహ్మహత్యాది పాతకములుతొలగును. సప్తసాగరసంగమతీర్థమున స్నానము చేసిన సర్వసాగర స్నాన ఫలితము దక్కును. సప్త సాగరములు కృష్ణను దర్శించుటకు సూక్ష్మరూపమున వచ్చిన ప్రదేశమిది. గోపాదతీర్థము, బహు సహస్ర విశాల గోపాదములచే చిహ్నితమైన తీర్థము. అందు శివుడు లింగరూపమున స్వయంభూతుడై యావిర్భవించెను. నదిమధ్యమున గోపాదేశ్వరుని

స్పృశించి మూడు దినము ఉపవసించిన, గోహత్యాపాతక విముక్తి కలుగును. పర్వకాలములందు కామధేను వెచటికి వచ్చును కనుక నిద్ర,గోపాదతీర్థము "నమో గోభ్యశ్శ్రీమతీభ్య స్సౌరభేయీభ్యఏవచ నమో బ్రహ్మ ప్రసూతాభ్యః పవిత్రాభ్యో నమోనమః" అని మారము నుండి వినినను, గోదాన ఫలము లభించును. అనంత తీర్థమునందు పడగలుండు హరిహరాత్మకమైన లింగము కలదు. హరిహరు లిరువురు ననంతులే. ఆలింగమును పూజించి, పంచమినాడు "యోఽనంతో ధరణీంధత్తే, యోఽనంతస్య ఫణేస్థితః యేఽనంతస్థాశ్చ విశ్వాం, శ్రీననంతాన్ ప్రణతోఽస్మితాన్, అనిజపించిన సర్పభయ ముండదు. ఆశ్లేషా నక్షత్రము నందును, పంచమి, అష్టమి, ఏకాదశి, చతుర్దశులయందు స్నానము చేసిన పొందరానిది లేదు. సూర్య తీర్థము సిద్ధసేవితము. రోగహరము. భానువారమునగాని. సంక్రాంతినిగాని, వ్యతీపాతము నందుగాని. కృష్ణ పక్షమున షష్ఠి సప్తమీ తిథులయందు గాని, స్నానము విశేషము. మలాపహారిణీ సంగమతీర్థ ప్రదేశము దక్షిణకాశి "వారణస్యుత్తరే దేశే, దక్షిణే సంగమస్థలా" "ప్రణవస్థా యథా వేదా, శివస్థా సర్వదేవతాః తథా సర్వాణి తీర్థాని సంగమస్థాని సువ్రతాం." పిండ ప్రదానమునకు గయవంటిది. మరణించిన వారికి మోక్షము. ఇచ్చట పరిగ్రహము కాని, హింస కాని పనికిరాదు. ఈ క్షేత్రప్రదక్షిణమునకు భూప్రదక్షిణ ఫలము. శ్రీశైలము, ప్రయాగ, వారణాసి, సంగమ తీర్థము, రామేశ్వరము శైవక్షేత్రములు. (ఋణాపకరణ తీర్థము దేవర్షి పితౄణములను విస్మరించిన పాతకము పోగొట్టును)

పూర్ణిమ, అమావాస్య, అష్టమి తిథుల యందును, సూర్య చంద్ర గ్రహణము సమయముల యందును. స్నానము చేసిన

గోసహస్రదానము ఫలము. అశ్వమేధ సహస్రఫలప్రదము. భ్రూణ హత్యాది మహాపాతకములు నివర్తించును. మాఘకార్తికములందు విశేషము క్షత్రియ సంహార పాపమునొనర్చిన పరశురాముడు ప్రాతః కాలమున పూర్వార తీర్థమును మధ్యాహ్నమున నదీ సాగర సంగమమును, రాత్రియందు మహేంద్ర తీర్థమును సేవించెడివాడు. సంగమ తీర్థమున శివుడు పంచముఖుడై స్వయంభూతుడయ్యెను. పరమేశ్వరుడు పూజించిన లింగము సంగమేశ్వర లింగమై వెలయుచున్నది. గోకర్ణక్షయము తీర్థమునందు వేయి జన్మము లందొనర్చిన గోవధాది పాతకములు నశించును. లింగతటియందు మాసము శివు నర్చించిన పూర్వజన్మ స్మృతి కలుగును. ఎచట యజ్ఞము జరుగుచుండగా విష్ణువు రాక్షసుల వంచించి దేవతల కమృతము పంచిపెట్టెనో, యచ్చోటు దేవహ్రదము. సూర్యగ్రహణ సమయమున వందలకొలది తీర్థములీ తీర్థమున జేరును. బదరికాశ్రమమున పదివేలేండ్ల ఘోరతపంబొనర్చిన నెట్టిఫలమో దేవహ్రద దర్శనమున నంత ఫలము. ప్రయాగ, ప్రభాస, గంగా సాగర సంగమ తీర్థములకంటె నుత్తమమై, బిల్వపత్ర ప్రమాణము హిరణ్యాన్న దానములు చేసిన లోకత్రయము ప్రమాణ మగును. ప్రయాగయందు నాలుగువేలసంవత్సరము లుపవసించినఫల మీ తీర్థ దర్శనము మాత్రముననే కలుగును, కన్యాహ్రదతీర్థము వారణాసి కంటె మిన్న. కన్యారూపిణి యగుచు దేవి యన్నదాత్రియై విలసిల్లుటచే నిది కన్యాహ్రదమయ్యెను.

## ఆంధ్రప్రదేశ తీర్థములు

395వ మైలువద్ద కృష్ణానది యాంధ్రప్రదేశమున బ్రవేశించు

చున్నది. మిగిలిన ?80 మైళ్ళదూరము నాంధ్రప్రదేశము నందే ప్రవహించి సాగర సంగమము చేయుచున్నది. మహారాష్ట్ర, కర్ణాటక రాష్ట్రములలో నెంత ప్రదేశము నావరించుచున్నదో, సుమారుగా నంత ప్రదేశము నాంధ్రమునందును ప్రవహించుచున్నది.

హైదరబాదుతీరమున నుగల "మూసీ" నను నది మునిగిపోకుండా నది యొక్క ముఖ్యమైన చివర యుపనది. ఈ నది ప్రవాహము కర్నూలు మండలము నుండి మహబూబు నగరమండలమును, గుంటూరు మండలము నుండి నల్లగొండ జిల్లాను, గుంటూరు జిల్లా నుండి కృష్ణా జిల్లాను వేరు చేయుచున్నది. ప్రసిద్ధమైన నాగార్జున సాగరము నంది కొండ వద్ద నిర్మింపబడినది.

కృష్ణానది యుపనదులలో, విశాల, విజయ, వైష్ణవి, కుముద, నారాయణి నదులు "పంచగంగ"లుగా ప్రసిద్ధి గాంచినవి, వానిలో విశాల సమీపమున కొల్హాపుర మున్నది. అష్టాదశ శక్తి పీఠములలో నందలి మహాలక్ష్మి యొకటి. తుంగ, భద్ర నదులు కలయిక తుంగభద్ర. ఇది కృష్ణకు యుపనది. దీనితీరముననే చరిత్ర ప్రసిద్ధమైన విజయనగర సామ్రాజ్యము నిర్మింపబడినది. ఇక నేటి యాంధ్రదేశమున కర్నూలునకు సమీపమున కృష్ణా తుంగభద్రా నదుల సంగమ క్షేత్రము కలదు. ఆ నదుల సంగమ స్థానమున స్నానమొనర్చిన నేడు జన్మముల పాతకమునశించును. దాని పేరు హేమలాపురము. శాసనములలో హంతపురమనియు శాక్తేయ పీఠ చరిత్రలలో "నలంపురి" యనియు నేటి వ్యవహారమున "నలంపుర" మనియు ప్రఖ్యాతము. ఇచ్చట శివుడు బ్రహ్మేశ్వర నామముతో నుండును. నవబ్రహ్మేశ్వర లింగములు

కలవు, దక్షిణకాశిగా ప్రసిద్ధము. ఇచ్చటి యమ్మవారు జోగులాంబ. 108 శక్తి పీఠములలో నిది యొకటి. ఆది శంకరు లీయమ్మవారి వీక్షణము వాడి తగ్గించి రనియు, నిప్పటికి నెదురు గానుండి చూచువారు నిసేజస్కులగు దురనియు పెద్దలమాట. ఆలయ శిల్పము గొప్పది. శ్రీశైలమునకు నిది పశ్చిమ ద్వారము.

## పాతాళ గంగ

శ్రీశైల ఉత్తరద్వారమగు సిద్ధేశ్వరము మీదుగా శ్రీగిరుల మధ్యగా ప్రవహించిన కృష్ణానదికి 'పాతాళగంగ' యనిపేరు సర్వ దేవతా నిలయమగు శ్రీశైలమును భేదించుటకు భీతిల్లి, కృష్ణానది తొలగి పోవుచుండగా, దేవతలు మధ్యభాగమును భేదింప, నర్థింప, నామె యట్లు లీలగా చేయగా

"పాతాళ గంగేత్యభిధాం దధే గహ్వారా గామినీ" యని స్కాందము - "సర్వక్షేత్రమనోన్నద్రి, సర్వదేశమయశ్శివః, సర్వతీర్థమయీకృష్ణా, త్రితయం దుర్లభంత్విహ" అనిస్కాందము.

శ్రీశైలము, కర్నూలు మండలమున నందికొట్కూరు తాలూకాలో నున్నది. శ్రీగిరి, శ్రీశైలము, శేషాద్రి, శ్రీపర్వత మను పేర్లతో దీనిని వ్యవహరించుట కలదు. ఈ కజ్జల పర్వతము లకు బ్రహ్మగిరి, విష్ణుగిరి, రుద్రగిరి యను నామములు కలవు. చిరంజీవులలో నొకడైన యశ్వత్థామ యిచ్చట తపస్సు చేయు చుండునని సూతసంహిత చెప్పుచున్నది ఏడుపర్వత విభాగములు వర్తులాకారముగ నున్నవనియు, పడగయెత్తివరున్న మహాసర్పము వలె నాపర్వతముండు ననియు, పడగపై వేంకటేశ్వరుడు, మధ్య

మల్లికార్జునుడు, తోకచివణ అహోబిల నారసింహుడు నుండెనని చెప్పుదురు. అష్టాదశ దేవీ పీఠములలో భ్రమరాంబా పీఠమొకటి. స్వయంభూ లింగమైన శ్రీశైలలింగము ద్వాదశ జ్యోతిర్లింగము లలో నొకటి 24వ త్రేతా యుగమున శ్రీరాముడు శ్రీగిరీశుని సేవించి, పాతాళ గంగయందు, దశరథునకు శ్రాద్ధ మొనరించె ననియు, 28వ ద్వాపరాంతమున శ్రీకృష్ణుడును పంచ పాండవులు దీనిని దర్శించిరనియు గ్రంథములు చెప్పుచున్నవి శిలాదుని కుమారుడు పర్వతుని నామముతో పనుమతి యనుకన్యకపైన 'శ్రీ'నామముచేర్పుటచే, శ్రీపర్వతమయ్యెననియునందువిశ్వనాథుడు చంద్రావతియను భక్తురాలి యభ్యర్ధనముపై మల్లికార్జుననామము దాల్చెననియు నొకగాధ. పాతాళగంగా తీరమున నాత్మనిష్ఠతో నున్న ఆదిశంకరుల నొక కాపాలికుడు భైరవునికి బలినీయ యత్నింపగా, శిష్యుడు పద్మపాదుడు, నృసింహావేశము బూని యాతనిని చీల్చివేసెనని శంకర విజయ ప్రమాణము. ఆదిశంకరు లిచ్చటనే శివానందలహరి, భ్రమరాంబాష్టకము రచించిరి. వారు తపస్సు చేసిన స్థానము నన్వేషించి, కామకోటి పీఠాధిపతులు చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి వారును కొంతకాల మచ్చట తపస్సు చేసిరి. "కాశ్యాంతు మరణాన్ముక్తిః, కేదార జలపానతః, శ్రీశైల శిఖరం దృష్ట్వా, పునర్జన్మ న విద్యతే" యని పురాణ వచనము. శ్రీశైలమును నిత్యము సంకల్పమున స్మరించు చుందుము.

ఈ క్షేత్రానికి ద్వారములు నాల్గు. తూర్పుద్వారము త్రిపురాంతకం, దక్షిణద్వారం సిద్ధవటం, పడమటిద్వారం, అలంపురం, ఉత్తరద్వారం మహేశ్వరం. ఆగ్నేయంలో స్కంద సోమేశ్వరం,

నైఋతిని అహోబిలం, వాయవ్యంలో మహానంది(నందిమండలం) ఈశాన్యంలో ఏలేశ్వరం, ఉన్నవి అంతర తీర్థాలలో భ్రూమధ్య లో వారణాసియున్నచో, శీర్ష స్థానములో శ్రీశైలమని, కాశీఖండ వచనము. పాతాళగంగ యందు స్నానమాచరించి సూర్య. చండి, మహేశ్వరులను పూజించు వారికి సర్వాభీష్టములు సిద్ధించును

నందికొండ వఱకు కృష్ణానదిలోచ్చిన పిదప,సప్తనదీ సంగమ తీర్థము, అచలేశ్వర తీర్థము, దేవహ్రాద తీర్థముతో కూడిన భీమ తీర్థము కలవు. జగ్గయ్య పేటకు ఆఱుమైళ్ళ దూరములో కృష్ణానది కృష్ణాజిల్లాలో ప్రవేశించు చున్నది. ముక్త్యాల వద్ద ముక్తితీర్థము, వేదాద్రియొద్ద నారసింహ తీర్థము కలవు. హిరణ్య కశిపు వధా నంతరమునరసింహమూర్తి యిచ్చటనే స్నానమొనరించినిలచెను. సాలగ్రామశిలగా కృష్ణలో నుండును. తరువాతిది హరిణావర్తక తీర్థము కిరాతులచే తరుమ బడినలేళ్ళు కృష్ణవేణిని శరణుజొచ్చి, దివ్యత్వము నంది యాకసమున కెగసినవి అందలి నీటి సుడి నేటికిని చూడనగును. తరువాతిది పాప నాశన తీర్థము.

## అమరావతి

శ్రీశైలమున ఈశాన్యముగ కృష్ణ దక్షిణ తీరమున నమ రేశ్వర తీర్థముకలదు. ఇందు కోటితీర్థములు నిత్యసన్నిహితము లై యుండును. స్నానము, శ్రాద్ధము, కోటిగుణ ఫలప్రదము శివసాయుజ్యము నందు వారలకే. యిట, మరణము లభించును పౌర్ణమాసి, అమావాస్య, రుద్రద్వాదశి. భాను వారము, సంక్రాంతి, కృష్ణాష్టమి, చతుర్దశి, వ్యతీపాతము, సూర్యచంద్ర గ్రహణములు, సప్తమీ సోమవారములు, వైధృతి. మాఘమాసము, విషువములు

అయనములు, మొదలగు పర్వదినముల స్నానముచేసి, యమరేశ్వరుని సేవించుచో, సహస్రయజ్ఞ ఫలము లభించును. కేవలము స్నానము చేతనే యనేక సహస్ర గోదాన ఫలము లభించును. భక్తితో తీర్థమునందు స్నానముచేసి, యమరేశ్వరునియర్చించుచో పునర్జన్మయుండదు. భైరవుని, గణాధిపతిని, చండుని, దుర్గను, సోమేశ్వరుని సేవించి పిమ్మటనే యమరేశ్వర దర్శనము చేయవలెను. సిద్ధులిచట సులభముగ లభించును. ఇంద్రాది దేవతలు, కపిలాది సిద్ధులు, ముని రూపములతో నిట తపస్సు చేయుదురు. తీర్థ దర్శనమే కోటి జన్మ పాపహరణము. మ్లేచ్ఛ దేశముల వసించువారయినను, నీ గంగ గ్రోలినచో పాపముక్తుడగును" తస్మాద్దక్షిణ గంగా స్యాద్దేవే నైవ వినిర్మితా, పరివారయుతో బ్రహ్మాతథా విష్ణుర్జగన్మయః, వసంతి ఋషయస్సర్వే, దేవా ఇంద్ర పురోగమా" అని స్కాందము, దీనిని దక్షిణ గంగగా పేర్కొనినది. తీరమున మృతి జెందిన శ్వపాకునకైనను ముక్తియే. "తావత్ జాహ్నవీ జ్ఞేయా, యావచ్ఛ్రీశైలగామినీ, అత ఊర్ధ్వం శతగుణా యావత్సాగరసంగమమ్." అని గంగ కంటె నూఱురెట్లు ఫలదాయిగా కృష్ణానది చెప్పబడినది. తీరమునకు యోజనపు దూరముగల ప్రదేశమంతయు ముక్తి క్షేత్రమే. ప్రణవేశ్వర, అగస్త్యేశ్వర కోసవేశ్వర, సోమేశ్వర, పార్థివేశ్వర నామములతో నిచ్చట నయిదు లింగములు కలవు. ఇది బౌద్ధముకాదని శ్రీ రామబ్రహ్మాలు సుబ్రహ్మణ్యముగారు వ్రాసిరి.

గుంటూరునకు సుమారిఱువది మైళ్ళదూరమునను, విజయవాడ నుండి జలమార్గమున నిఱువది మైళ్ళ దూరములోను న్న

సత్తెనపల్లి తాలూకాలో ధాన్యకటకము (ధరణికోట)న కతి సన్ని హితముగ "నమరావతి" కలదు, ఆ ప్రదేశములో రాక్షసులతో యుద్ధములో నోడిపోయిన దేవతలుండుటచే దానికా పేరు వచ్చినది. తారకాసురునకును దేవేంద్రునకును పదివేలేళ్ళు యుద్ధము జరిగి, యింద్రుడోడి, విష్ణువును శరణుజొచ్చగా, తారకుడీశ్వర భక్తుడని తన నిస్సహాయతను విష్ణువు ప్రకటించి. యింద్రాది దేవతలను కైలాసమునకు తీసికొనిపోయెను. శివుడు, తారకుడు తనభక్తుడయినను, ధర్మద్రోహి కాన, వధింపదగిన వాడేయైనను, తానుచంపననియు, నంతమున శివసాయుజ్యమాతని కిత్తు ననియు, నాపని కుమారస్వామి నెఱవేర్పగలడనియు చెప్పెను. కుమారస్వామి చేసిన యుద్ధములో తారకుడు మూర్ఛిల్లి లేచుటయే కాని, చావనందున, శివునితో నాలోచింపగా, నాతనికంఠములోని శివలింగము భగ్నమయినగాని, యాతడుమరణింపడనగా, కుమారుడట్లు చేసెను. తారకకంఠగత లింగము ఛిన్నమయి యాతడు మరణించెను కాని, యా లింగమయిదు శకలములై వృద్ధి పొందు చుండెను. ప్రతిష్ఠచేసినచో నదియాగిపోవునసెడి యీశ్వరవచనము ప్రకార మింద్రుడొక శకలమునాశ్వయుజ శుద్ధ దశమినాడు ప్రతిష్ఠించెను. అమరేశ్వరుడు ప్రతిష్ఠించుటచే నది యమరేశ్వర లింగమయినది. ఆ శకలము పడినచోట నడుగున పాతాళము వఱకు క్రౌంచపర్వతమున్నది. ఆ కొండమీద లింగము కొంతవరకు పెరిగిన పిదప ప్రతిష్ఠ జరిగినది. ఆ స్ఫటికలింగము మూడడుగుల కైవారము కలిగి, షుమారు నలుదదియడుగుల యెత్తున్నది. స్వామికి క్రౌంచనాథుడను పేరుగలదు, అందుచేతనిది క్రౌంచ పట్టణమనియు, నీ బాలాచాముండేశ్వరీ పేరుగల అమ్మవారష్టాదశ

శక్తులలో నొకటియనియు, కొందరు భావించుచున్నారు. మిగిలిన శకలములు పడినప్రదేశములు 1) భీమారామము (గుణుపూడి భీమవరము) 2) క్షీరారామము (పాలకొల్లు) 3) దక్షారామము 4) కుమారారామము లేక స్కందారామము [సామర్లకోట]. వీనిని పంచారామములందురు. శుక్రాచార్యులు బృహస్పతితో కృష్ణాదిరాకతో నమరేశ్వర లింగము మునుగునేమోయనిసందేహము వెలువరింపగా, నడుగున నున్న క్రౌంచపర్వతము పెరుగునని గుడ డనెను.

శ్రీవాసిరెడ్డి వేంకటాద్రి నాయనిగారు, క్రీ శ 1761 లో జన్మించి, 1816 లో శివసాయుజ్యము నందిరి. తండ్రిపేరిట జగ్గయ్యపేట, తల్లిపేరిట, "అచ్చంపేట" తన పేరున "రాజాపేట," మన్నెసుల్తాన్‌పేట, నాయనిపేటల, వెలయించిన, చింతపల్లి సంస్థానాధీశులు పరాక్రమ వంతులు దేవబ్రాహ్మణభక్తులు, దానశీలురు. అఱువది యాఱు గ్రామములు సద్బ్రాహ్మణులకగ్రహారములుగ నిచ్చినవారు. మంగళగిరి యందు పదునొకండు ద్వారములుగల గోపురమును నిర్మింపించినవారు,

శ్రీశైలమునకేగు వారిని చెంచులు బాధించి దోచుకొనుచుండ వారి నెల్లఱ నొకచోఁదు కాహ్వానించి, వందయిన పిదప వారిని కడతేర్పింప జేసి యా యుపద్రవముల నణచి వేసిరని, చిరకాలము నుండి వచ్చుచున్న జనశ్రుతి. తన రాజ్యమున నున్న గ్రామములపైబడి దోచుకొను చెంచుల, నొకనాడు వధింపగా సైనికుల కాజ్ఞయిడెననియు, వారు నిర్దాక్షిణ్యముగా చెంచుల వధించిరనియు, రమాదాసు, శ్రీకృష్ణదాసు, భీమదాసు, వెంకట

దాసు, వీరదాసులను, చెంచునాయకులే ఖడ్గ ప్రహారములను చాపక పోవుటచే, వారిని చిత్రహింసలను బెట్టి, దానికి కారణము వారి శిఖల గలిగిన తాయెత్తులని తెలిసికొని, వానిని అపహరించి వధించిరని యు నందనవనం సుబ్బారావుగారు తమ శ్రీ అమరేశ్వరక్షేత్ర మహిమయందు వ్రాసిరి. ఆ పాపము రాజావారిని బాధింపజొచ్చె ననియు, కోటలో నెచ్చట జూచినను చెంచుల రూపములే కన్పిం చుట, భయంకర ధ్వనులు విన్పించుట, అన్నము రుచింపకుండుట కలుగిగా, వారుదానినివృత్తికయి యేకముహూర్తమున నూటొక్క శివాలయములకు ప్రతిష్ఠ గావింపించిరనియు, బంగారుపూత పూసిన నూటయెనుబది ధ్వజస్తంభముల తమ రాజ్యములోని పుణ్యస్థలముల నెలకొల్పిరనియు, సువర్ణ వికారమైన గోవును చేయించి, దాని గర్భమున తాను ప్రవేశించి బ్రాహ్మణులకు దానిని దానమొసంగిరనియు, నప్పుడు చర్మకారులది మృతగోవు కనుక తమది యనగా, దానికి తగిన వెలను వారికొసంగిరనియు రెండుమారులు రజితముతోడను, నొకమారు సువర్ణముతోడను తులాభారము తూగి, యాద్రవ్యమును బ్రాహ్మణులకు పంచి రనియు, చరిత్ర కలదు. అమరేశ్వరాలయపు రెండవప్రాకార ములో నుత్తరదిశగానున్న మండపమునందు శ్రీకృష్ణదేవరాయలు 1515 లో తులాపురుషదానముచేయుగా, దక్షిణదిశగానున్న మండ పమునందు క్రీ. శ. 1796లో వాసిరెడ్డివారు చేసిరి.

ఇంత చేసినను పాపము బాధించుచున్నందున, రాజా వారీ శ్వరధ్యానము చేయుచుండగా, స్వప్నమున శివుడు కన్పించి పాపనివృత్తికి యమరేశ్వరుడగు తన్ను, తన సాన్నిధ్యమున

నివసించి సేవింపవలసినదిగానాజ్ఞాపించెను. వెంటనే యమరావతిని మహాపట్టణముగ నిర్మించుటకు చర్యలు తీసుకొని, 1796 లో తన స్థావరమును చింతపల్లి నుండి యమరావతికి మార్చుకొనిరి. స్వామికి కల్యాణ మంటప ప్రాకారముల కట్టించి, కలశంబులకును కీర్తిధ్వజంబులకు రాగితొడుగు వేయించి, దానికి బంగారుమలామా చేయించిరి, తొమ్మండుగు రర్చకులకు స్వయంపాకములు కోటలోనుండి యిప్పించుచు, నొక్కొక్కరికి పంద్రెం డెకరముల భూమి నొసంగిరి. "స్వామివారికి నైవేద్యమునేర్పాటుచేయించిరి వేంకటాద్రిప్రభువు దాతృత్వము నెందఱో కవులు కీర్తించిరి. శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. 1515 లో స్వామికి పెదమద్దూరు గ్రామమును దానముచేసెను. తురుష్కదండయాత్రవలన మలినమైన యాలయమునకు హంద్రికం పెద్దప్పగారు సంప్రోక్షణము గావించిరి. ఈ తీర్థమునకు ప్రాగ్భాగమున, భైరవుడున్న చోటున కెదురుగా క్రౌంచతీర్థము. తరువాత వైకుంఠపురమను గ్రామమున కృష్ణ యుత్తరవాహినియగు విష్ణుతీర్థము కలదు.

## విజయవాటీ తీర్థములు

దుర్గమాసురుని చంపిన దుర్గ, సర్వదేవ పూజితమై యింద్రకీలాద్రియందు వసించెను. మల్లిఖార్జునస్వామియు నచ్చటనే యుండెను. ఆమె మహిషాసుర మర్దనముగూడ చేసెను. దర్శనమాత్రము చేతనే పాపములను పటాపంచలుచేయు పరమ పావని కనకదుర్గను,తనయందే వసింపుమని యింద్రకీలాద్రి కోరుకొనగా నందు వసించుటంజేసి యాగిరికి నది మొదలు కనకాద్రి యని పేరు

వచ్చెను. పుణ్యాత్ముల కా కొండ కనక మయముగనే కన్పించును, మహిషాసుర జయము వలన నీ ప్రాంతము జయపురి యయ్యెను. "తతః పశ్చా దర్జు నశ్చాపి, తప స్తప్త్వాతు ఫల్గుణః, మల్లి కేశ్వర దేవాచ్చ, లబ్ధ్వా పాశుపతం ధనుః, స్తుతించ క్రేతతః పశ్చాత్ విజయా హి పురీ హ్యభూత్" అని, స్కాందపురాణ మనుటచే తర్వాత నిది విజయపురి యయ్యెను.

"సర్వదేవ మయోహ్యద్రి, స్సర్వదేవాత్మక శ్శివః నృసింహో వాస పర్యంతం, కీలారూపేణ వర్తతే" అట్టి పర్వతమును పతి యోగము కాంక్షించు కృష్ణ ఛేదింపలేక నిలువగా, దేవత లింద్ర కీలాద్రిని మార్గము నీయవలసినదిగా నర్థించిరి. అతడామె పోవుటకు వీలుగా సురంగమును కల్పించెను. ఆమె హుంకార మొనర్చగా, నా కొండ భిన్నమయి రెండు క్రోసుల దూరములో "నెనమలకుదురు" లో బడెను. ఆమె సముద్రాభి ముఖముగ తన ప్రయాణమును సాగించెను. ఆ రెండు కొండల నడిమి భాగమునకు ముక్తి క్షేత్రమని పేరు.

విజయవాడ యందు పెక్కు తీర్థములు కలవు. ఉండవల్లి గుహకు సమీపమున నున్నది అనంత తీర్థము. ఇంద్ర కీలాద్రికి దక్షిణమున నున్నది ఫల్గున తీర్థము. ఆ రెండు కొండల నడుమ భాగముననే దుర్గా తీర్థమును కలదు. "అత స్తత్ఫల్గునం తీర్థంతుత త్రైహి, శివ త్రిశూల తీర్థంచశంఖ తీర్థంచతత్రవై ఇంద్ర తీర్థం చతత్రైవ, ఋషితీర్థమతఃపరం, ఏతక్షేత్రేణ సదృశం నభూతంనభవిష్యతి. ఏతచ్ఛ్రవణ మాత్రేణ పలాయంతేచ పాతకాః" సీతాహనమ త్తీర్థము

సీతానగరము వైపున కలదు. సుదర్శన నారసింహ తీర్థము మంగళగిరి వైపున కలదు. వరాహతీర్థము కృష్ణానదిలోనే యున్నట్లు కన్పించును. అచ్చటి స్నానపానములు బ్రహ్మహత్యా పాతక నాశకములు. ఇచట పితరులకు పిండము లొసగిన, నిజ నటు పది తరములవారు తరింతురు "శ్రుతత్వా బ్రాహ్మణాస్సర్వే శివ రూపా న సంశయః తేషాందర్శన మాత్రేణ పలాయంతేచ పాతకాః తేషాం ప్రదత్తం యద్దానం హేమవస్త్రాదికం చ యత్, మేరు దానేన సదృశం భవేదత్ర వినిశ్చయః"

దానికి తూర్పున ఫల్గునక్షేత్రము కలదు. "తస్మిన్‌క్షేత్రే మహాపుణ్యే తపస్తేపేచ పాండవః, తత్ర స్నాత్వానరో భక్త్యా, ఫల్గు నేశం మహేశ్వరం, నమస్కృత్వా ప్రయేద్దేవం తతో దానం మహా ఫలం, యంయం కామయతే కామం తంత మాప్నోతి భార్గవః"

దానికి తూర్పుగ సోమతీర్థము. ఇందొనర్చు దానము మేరు తుల్యమగును. దానికి తూర్పున వరుసగా గాయడ స్కంద తీర్థ ములు, శంఖ తీర్థములు కలవు. స్మరణము వల్లనే పాప హారకములు.

## కనకదుర్గా క్షేత్రము

శ్రీశైలమువలె సర్వదేవతా నిలయమైన ఇంద్రకీలాద్రిపై కనకదుర్గయున్నది. సర్వతీర్థమయమయిన కృష్ణానది యామెకు వింజామరలు పట్టుచున్నది. సర్వదేవతా స్వరూపిణియు, నవదుర్గ లలో బ్రహ్మచారిణి దుర్గగా నుపాసకులచే భావింప బడుచున్న

కనకదుర్గ వసించు క్షేత్రము మహాక్షేత్రము. ఈ మహాశక్తిని దర్శించుటకు కాశీనుండి రామేశ్వరము వెళ్ళి తిరిగిపోవుచు నొత్త రాహుతెండతో వత్తురు. కంచి కామాక్షి, మధుర మీనాక్షి, పేర్ల వలెనే బెజవాడ కనకదుర్గమ్మ పేరు నోదెపెప్పువారి రసనాంచలము లలో నిత్యము నాట్యమాడుచుండును. పూసపాటి వారింటి కుల దేవతగా నీమె ప్రసిద్ధము. శత్రు సంహారమునకి శక్తి పెట్టినది పేరు ఈమె జయస్వరూపిణి. సింహవాహన, ధృవమూర్తి స్వయంభువము." అరి శంఖ ఖేట శూలక పాశాంకుశ మౌర్వి సాయకాన్ దధతీన్, సింహస్థామగ్ని నిభాం. దుర్గాదేవీం ప్రపద్యఇహ శరణమ్" అని ధ్యానము. అష్ట విధాయుధముల ధరించినది.

ఈ అగ్నినిభను దర్శించుట కష్టమని యాదిశంకరులు, శాంతి యంత్రమును శ్రీచకముగా దేవీ వామ పార్శ్వమున ముందుగ ప్రతిష్ఠించిరి. ఉపాసకుల కామె స్వర్ణ రూపిణిగనె దర్శనమిచ్చును. కోరిన కోర్కులు ప్రసాదించు తల్లికనుక, వ్యాధు లున్నవారు,సంతానార్థులు తడిబట్టలతో గుడిచుట్టును పడుకొందురు. ఈ పడటను ప్రాణాచారమని యందురు. వారికి స్వప్నములో నమ్మవారు కన్పించి ఫల మిచ్చునని యొక యాశ. అట్లు ఫల మిచ్చినదని చెప్పువారును కలరు. అస్మత్పురమ గురువులు కల్యాణ నంద భారతీ మంతాచార్య స్వామివారు తమకు సంశయము కలిగి నప్పుడు, దేవీసాన్నిధ్యమ్మున నిద్రచేసి యాసంశయమును నివా రించుకొనెడి వారని శ్రీమాన్ దీవి నరసింహాచార్యుల వారు, శ్రీ కనకదుర్గా క్షేత్ర మాహాత్మ్యములో వ్రాసిరి. అమ్మవారికి ఎడమ ప్రక్క గణపతి విగ్రహము కలదు.

సర్వతీర్థ మయమైన దుర్గాంబాకుండ మాహాత్మ్యము పద్మపురాణమునను, కనకదుర్గామాహాత్మ్యము, పద్మ, బ్రహ్మాండ పురాణము లందును వర్ణింపబడినది. "తస్యాద్దర్శన మాత్రేణ, పలాయంతేఽతిపాతకాః ఇంద్రకీలస్తు దుర్గాంబాం, స్తుత్వాతాం జగదంబికాం" అని దుర్గనుగూర్చి స్కాంద పురాణ సహ్యాద్రి ఖండములో నభివర్ణింపబడినది సూతసంహిత, దేవీ భాగవతములలో దుర్గాప్రశంస కలదు. ఈ దేవతనుగూర్చి విద్యారణ్యులవారు, జగద్గురువులు స్తవము చేసియున్నారు.

## అమ్మవారిని గూర్చిన కథలు

ఈ యమ్మవారి కొండలోపల నింకొక గుడి యున్నదనియు నందులోనికి సిద్ధులు తప్ప పోవ శక్యము కాదనియు చెప్పికొనెడివారు. బ్రాహ్మణ వీధిలో పెద్ద పెద్ద పాదములు కలవారు నడచిన గుర్తులున్నవనియు చెప్పికొనెడివారు. అమ్మవారిని కొలచిన నెట్టి పిశాచములయిన తొలగిపోవుననియు, నట్లు తొలగిపోయినవారు, నేలమీద నడువక, దుప్పట్లు వరుసగా పఱచుకొనుచు, నడుచుచు, నెత్తిపై కుండపై నిప్పులు పోసికొని మేళతాళములతో కొండ నెక్కి మ్రొక్కును చెల్లించుకొనెడివారు.

అమ్మవారి కొండ వెనుక నృసింహబిలమని యొకటియుండి నట్లు శాసనాధారములున్నవి. అది యమితసూక్ష్మమైనది. ప్రక్కనే కొండ తొలచి, గోవిందుడను నొక హరిజను డుండెడివాడట ! ఆ

గుహకు "గోవిందగుహ" యని పేరు వచ్చినది. గాంధీ నగరములోని మొక్కపాటి సాంబమూర్తి గారి యింటికొక యతి వచ్చి సుమారిఱువది దినములుండి ప్రతిదినము నెచ్చటికో వెళ్ళెడివాడు. వారి మేనత్త, తానుకూడ వచ్చెదననగా, రాజాలవనియు, నయినను రమ్మని, యాతడా బిలముగుండ సూక్ష్మ రూపమున లోనికి వెడలి పోయిన పిమ్మట, యామె విసిగి యింటికి వచ్చివేసెనట. ఆనాడే యతి తిరిగివచ్చి యదియే చివరి దినమనియు, పలు ప్రదేశముల నుండి బ్రహ్మ విచారణ చేయు సిద్ధులట యమ్మవారి సాన్నిధ్యమున సమావేశమయితిమనియు, లోన తామరకొలను కలదనియు నేమేమో చెప్పివెడలి పోయెనట. ఎట్లో యట్లు లోనికేగిన వారి నచ్చటవారు, కొలనులో స్నానముచేసి కండ్లు మూసికొనుమని యని, వారట్లు చేసినచో, తోడనే విజయవాటీ వీధులలో నుండెడి వారనియు, నర్ధశతాబ్దము క్రిందట నేను వినియున్నాను.

గుంటూరు మండలమునకు చెందిన శ్రీ కొల్లూరులోని, బెఱువు లక్ష్మీనారాయణశాస్త్రి గారొక తూరి సాహసించి, లోనికేగగా, నక్కడ నొక యోగి నవఖండ యోగములో నుండెనట ! అనగా శరీరములోని యవయవములు తొమ్మిది ముక్కలుగా విడిపోవునట్లు చేయుట. వీరిరాకను చూచివారవి తిరిగి సదికించుకొను చుండగా, వీరు భయపడి తిరిగివచ్చి వేసిరట. వారీ విషయము శ్రీ కలగా అంజనేయశాస్త్రి గారికి చెప్పగా, వారు నాకు చెప్పిరి.

అమ్మవారి మహిమ లద్భుతములు. పెద్దకళ్ళేపల్లి నుండి యాలయ సంప్రోక్షణమునకు విజయవాటికకు వచ్చిన, బుద్ధు ఉమాపతిశాస్త్రి, చలపతి శాస్త్రిగారి యింటిలో నలుగురు బాలికలు గాజులసెట్టి దగ్గఱ గాజులు వేయించుకొనగా, నాత డయిదుగురు

వేయించుట కున్నారని వెల కోరినాడనియు, వారిచ్చివైచి, యాలయములోనికి పోయి చూడగా, నమ్మవారి చేతికట్టి గాజులే తెలసనియు, నప్పటినుండియు నమ్మవారికి గాజులు వేయు ఆచారము వచ్చినదనియు చెప్పెదరు.

అమ్మవారు బాలిక వేషముతో కొండ దిగివచ్చి క్రొత్త గుళ్ళలోని యొకబాలికను, చెల్లీ! యని రమ్మని పిలచి, కంభము మెట్టు నుండి వచ్చి జీవించు "ఫిల్లీ వెంకన్న" యను యాదవుని రిక్షా ఎక్కి "రోజులు మారాయి" అను సినిమా చూచుటకు హాలు దగ్గఱనే యుంతమని యతనితో చెప్పి, కొద్ది సేపటికే బసుటికివచ్చి చెల్లెలిని దారిలో దింపివైచి, అమ్మవారు కొండ ఎక్కుచుండగా, రిక్షావాలా కిరాయి అడుగగా, తలగుడ్డలో పది రూపాయలున్నవని చెప్పి, వెనుకకు తిరుగక వెళ్ళుమని చెప్పినదట! అతని తలగుడ్డలో నా రూపాయల జూచి యాశ్చర్యపడిన విషయము మాతడు, కనక దుర్గా క్షేత్రమహాత్మ్యమును రచించిన దీవి నరసింహాచార్యులుగారికి చెప్పినట్లు వారు వ్రాసిరి. నగరమునను పెక్కురు చెప్పికొనిరి.

## కనక వర్షము

"తం కీలాద్రిం స్వర్ణమయం త్వద్రూపాం జగదంబికాం,
ఇంద్రాది దేవ సంసేవ్యాః తదగ్రే దివ్యరూపిణీం" అనినట్లా మెపేర నొకప్పుడీ నగరమునకు కనకపురి యనిపేరు వచ్చుటయే కాక, యింద్రకీలాద్రి స్వర్ణనగమనియు, నామె రూపము బంగారమే యనియు తేలుచున్నది. అట్టియామె కనకవర్షము కురిపించుటలో నాశ్చర్యములేదు. మాధవవర్మ నృపతి కుమారుడు విజయవాడలో

తన రథము నొక తెలికుల బాలకునిపై పోనీయుగా, నాతడు మరణించగా, నామె తల్లి న్యాయమును కోరగా, మాధవవర్మ తన కుమారునకు మరణ దండనము విధించెను. అతని ధర్మనిష్ఠకు, మెచ్చి చినుకుచిన్నము బంగారముగా,కనకవృష్టి కురిసి,ఆమె తన పేరు కనకదుర్గగా సార్థకము చేసికొనెను. మృత బాలకుని సజీవుని చేసెను. ఈ విషయము 7\|6 వ శాసనముగా, పాత శివాలయమున అనగా భ్రమరాంబా మల్లికార్జునాలయమున పదిలపఱుపబడి యున్నది. ఆ యాలయ స్థ లింగము యుధిష్ఠరుని ప్రతిష్టయని కొందఱును, నగస్త్యుని ప్రతిష్ఠయని కొందఱను చెప్పుదురు. శివరాత్రి కిచ్చట కల్యాణము జఱుగును.

దుర్గాదేవిని గోలకొండ తానీషా యొద్ద మంత్రి దండనాథులైన యక్కన్న మాదన్నలు సేవించినట్లు, వారు తొలిపించిన యక్కన్న మాదన్న గుహల చావిడులు నేటికిని సాక్ష్యమీయు గలవు. విష్ణువర్ధనుడను రాజు కొండపైనొక శివాలయము నిర్మించినట్లు కన్పించును. నేడది కానరాదు. తూర్కు రాజమ్మవారికి భక్తితో దానము లిచ్చు శాసనములును, వల్లవచక్రవర్తి సిద్ధయ యిచ్చిన దానశాసనములును, మఱి కొందఱి శాసనములును కలవు శ్రీకృష్ణదేవరాయలు కళింగదేశ విజిగీషా మనీషం దండెత్తి పోయి విజయవాటింగొన్ని వాసరములుండెను. రాయలు విజయమును కాంక్షించెను. అమ్మవారి పేర్లలో "విజయ" యొక్కటి కదా! అతడు కొన్ని దానములిచ్చెను. మంటపాదులను కట్టించినట్లు శాసనమున కలదు. వేశ్యలైన,శ్రీరామాయి మాచలదేవిగారలు పాపవినా

శన దేవరకు వివిధ గ్రామములలోనుండు క్షేత్రములు శాసనములు వ్రాయించి సమర్పించిరి. బత్తినేని శ్రీగిరియాను కళావంతుడు మల్లేశ్వర దేవరకు దక్షిణమ్మున వినాయకదేవర గుడి కట్టించెను. యుద్ధమల్లుని శాసనము, పద్యపరముగ, వాఙ్మయ చరిత్రములోనికి ప్రసిద్ధికెక్కినది.

## మల్లేశ్వర స్వామి

స్వయంభువములైనవి కాని, దేవతలచే ప్రతిష్ఠింపబడిన విగ్రహములు కలవి కాని, యాలయములు గల క్షేత్రములు, ప్రశస్తములు. నైసర్గికముగ పుష్కరములున్న నదులు తీర్థములలో ప్రశస్తములు. పర్వతముల పైన, లేక, సమీపమున, నది, లేక, సముద్ర తీరమున, తపో భూమిలో, దేవతలచేత స్థాపింపబడినవి సిద్ధ స్థానములు. అచ్చటి హృదయ పరిణతి కవి దోహదము చేయును. కృష్ణా తీరమున, ఇంద్రకీలాద్రిపై దుర్గామల్లేశ్వరుల యాలయములున్నవి. మల్లేశ్వరునే కొందరు మల్లికార్జునుడందురు. సూత సంహిత యందును, దేవీ భాగవతమునందును కృష్ణానది ప్రాశస్త్యము కలదు. మహాభారతములో- సహా నిరామ యూం కృష్ణాం, మంద గాం మందగామినీం-అనియు, తతో గోదావరిం రమ్యాం, కృష్ణ వేణీం మహానదీమ్, వరదాంచ మహాభాగాం, మహారంగ ని షేవితాం - అని పేర్కొనబడినది.

1) శ్రీశైలము (2) మహానంది [ఓంకారము] (3) త్రిపురాంతకము (4) దొనకొండ (5) సిద్ధమునిపురము [సిద్ధవటము] ఉమామహేశ్వరము హేమలాపురి (6) సిరికొండ (7) చేజెర్ల

[కపోతేశ్వరము] (8) కోటప్పకొండ (9) అమరావతి (10) తాడి
కొండ (11) గుంటూరు 12) కాకాని 13) మంగళగిరి 14) కొప్పర్తి
[బాపట్లకు సమీపము] 15) ఏజెండ్ల 16) విజయవాడ 17) వేదాద్రి
18) శ్రీకాకుళం - ఇవి శ్రీగిరి మల్లికార్జున మహిమా ప్రసార క్షేత్ర
ములుగా పెద్దలచే భావింపబడుచున్నవి. ఇందు కొన్ని వైష్ణవ
క్షేత్రములైనను, నందున్న శివుడు శక్తిమంతుడే.

"జ్యోతిర్లింగ స్వరూపేణ, బభౌ సర్వేశ్వరశ్శివం, శతాశ్వ
మేధా నాబ్రహ్మా లోకపితామహః, తదాతం పూజయామాస దేవం
మల్లికదంబకైః, దర్శనం బ్రహ్మణోదత్వా, బ్రహ్మలోకం దదౌ శివః
తదా ప్రభృతి దేవేశం, మల్లికేశం వదంతిహి, మల్లికార్జున దేవశ్చ
తత్రైవా ఒస్సీత్సుఖ ప్రదః కృష్ణాతీరమున బ్రహ్మ నూరశ్వమేధ
యాగములు చేయగా, శివుడు జ్యోతిర్లింగ స్వరూపుడై ప్రత్యక్షమై
బ్రహ్మలోకాధిపత్య మనుగ్రహించెను. బ్రహ్మ, మల్లికా ప్రసూన
ముల బూజించుటచే శివుడు మల్లికేశుడయ్యెను. అమరేశ్వరలింగ
ప్రతిష్ఠ యింద్రునిదికాగా, మల్లేశ్వరలింగ ప్రతిష్ఠ బ్రహ్మదేవునిది.
ఈ ప్రదేశమునకు తూర్పున, స్వర్ణగిరిపై మాచవరములో దాసాంజ
నేయ క్షేత్రము కలదు.

సర్వదేవ మయోహ్యాదిః, సర్వదేవాత్మకశ్శివః, నృసింహా
వాస పర్యంతం శిలారూపేణ వర్తతే - యని స్కాందము చెప్పుట
వలన నిది మంటలపర్వతము. అనగా నగ్ని పర్వతము. కావున
కృష్ణవేణి యాదిలో ఛేదింపలేకపోయెను. నృసింహుడుగ్రమూర్తి.
శివుడు చిచ్చుల కంటివాడు, ఇద్దరును నొకే పర్వతమున నున్న
వారు. అందుచేత నది శిలారూపముననున్నది. దానిని కృష్ణవేణి

షేపించుటతో, నా యగ్నిపర్వతము కొంతవఱకును చల్లబడినది. నృసింహస్వామికి నిరంతరము పానకము పోయుటకూడ నా దేవ తను చల్లబఱచుటకే యని కొందఱి యూహ. ఈ స్వామికి మను ష్యులు మధ్యాహ్నముపఱకే పూజించుట యొక విచిత్రమైన విష యము. కాగా కృష్ణమ్మ రాకవలన నగ్ని పర్వతము శాంతమయ్యె నని భావింపవచ్చును. "అందుచేతనే "కృష్ణవేణి నమస్తుభ్యం, సర్వపాప ప్రణాశిని, భక్త్యాదత్తం మయాదేవి, గృహాణార్ఘ్యం సరి ద్వతే" యని యామె కర్ఘ్యమిచ్చుట.

## దక్షిణ కాశి

కృష్ణవేణి సర్వ తీర్థమయమని స్కాందమున చెప్పఁబడిన పంక్తులు, లోగడనే యుదాహరింపఁబడినవి. సర్వ తీర్థమయ మెట్లో తపశ్శాలి శ్రీ తాడేపల్లి రాఘవనారాయణ కృత దత్తభాగవతములో వివరింపబడినది. కార్తవీర్యుడు హతుడైన పిమ్మట నాతని సుతులు పరశురాముడు దగ్గఱలేనప్పుడు జమదగ్నిని వధింపగా, జామదగ్ని వచ్చిన పిదప, వారిని ముహూర్త మాత్రములో సంహరించెను. ఇరువదియొక్క మారులు క్షత్రియ కుల సంహారము చేసెదనని భీషణప్రతిజ్ఞను పూనెను. అతని తల్లి రేణుక, యాతనిని ముందుగా తండ్రికి వలసిన సంస్కారముల నాచరింపుమని కోరెను.

అతడు తనతల్లినొక ప్రక్కను, తనతండ్రి శవము నొక ప్రక్కను కావడి లోనిడి మోయుచు, సంస్కారము గావించు వారికొఱకు నరణ్యములో నాశ్రమముల నన్వేషించెను. సహ్యాద్రి సీమకు చేఱగా

నశరీరవాణి దత్తముని యాధ్వర్యమున సంస్కారము గావింపు మని పలికెను. అతడు దత్తముని నర్థింపగా, దత్తముని, సర్వ తీర్థములలో వెంటనే స్నానము చేసి వచ్చినచో, సంస్కారము జేయింతు ననెను. వెంటనే భార్గవరాముడు, తన పరశువుతో, సహ్యాద్రిని పగులగొట్టగా, నచ్చట నొక పెద్ద గుండ మేర్పడెను, సర్వ తీర్థములాకుండమున జరజరా ప్రవహించి కుదురుకొనెను. అతడు స్నాతుడై పితృకర్మ నాచరించెను. కృష్ణానది సహ్యపర్వత మున పుట్టినది. సర్వతీర్థము లందులో చేరినవి. పుష్కం సమయము కానప్పుడు కూడ, కృష్ణవేణి సర్వ తీర్థమయమే.

అట్టి సర్వ తీర్థమయమైన. కృష్ణవేణి తీరమున దుర్గామల్లే శ్వరక్షేత్రమై ప్రసిద్ధినందిన "దక్షిణకాశిని" విజయుడు పాశుపతము గొన ఈశ్వరలింగ ప్రతిష్ఠ చేసెను. ఆ విజయేశ్వరాలయమున, కాశినుండి శ్రీ వేమూరి శ్రీరామశాస్త్రిగారు బ్రహ్మసూత్రేశ్వరిని తెచ్చి ప్రతిష్ఠింపగా, పాటిబండ రామమూర్తిగారు పార్వతిని ప్రతిష్ఠిం చిరి.

వ్యాధిగ్రస్తుడై నప్పుడు, చంద్రశేఖరస్వామివారిని స్మరించు కొని మంచముపైనుండి, విజయేశ్వరునిపై వ్రాసినదీ మహా రుద్రము. ఇందు విశృంఖల ప్రయోగములు, విచిత్ర ప్రయోగ ములు కొన్ని కలవు. అంతయు నీశ్వరార్పణమే.

31 - 6 - 12
పైడి పాటినగర్
విజయవాడ-4

ఇట్లు
పైడిపాటి సుబ్బరామశాస్త్రి

# మహారుద్రం

శ్రీ మందారమ వౌచు భక్తులకు రా
శీభూత తేజస్కృతన్
భూమిన్ వ్యోమ పథమ్ము సర్వమును సం
పూర్ణమ్ముగా నిండి, యు
ద్దామమ్మై విలసిల్లు శక్తికిని కే
దారమ్మవై వెల్గు, ని
స్సీమాకారమ ! శంకరా ! హర హరా !
శ్రీ పార్థ లింగేశ్వరా !

2

శివన్ లింగము నిల్పి యీ విజయవా
టి న్నింద్ర కీలాద్రి పై
చేవ న్నిన్నుఁ బ్రతిష్ఠ జేసి తపముం
జేయంగ నా పార్థుడున్
బ్రోవ న్వచ్చితి వీయ బాశుపతముం
బ్రోయాలితో, నో, మహా
దేవా ! నిన్ను భజించెదన్ బరమ భ
క్తిన్, బార్థలింగేశ్వరా !

3

సవరిల్లున్ విజయేశ్వరాలయము, కృ
ష్ణా తీర ఘట్టంబునన్
రవణిల్లున్ గిరిపీఠమున్, విజయవా
డన్, మేలి సింగారమున్
లవలేశమ్మును శంకలేక, యిదె కై
లాసమ్ముగా నీ ధరన్
శివ ! నీ భక్తులు చేఱవచ్చెదరయా,
శ్రీ పార్థ లింగేశ్వరా !

4

చీకుం జింతయు లేకయుండెడి మన
స్సిద్ధిం బ్రసాదింపవే
నాకుం జన్మము లేకయుండునటు సం
ధానింపవే జ్ఞానమున్
ధీ కల్పించిన నాదు కావ్యము మహా
దేవా ! మహారుద్ర, మ
స్తోకమ్మౌ యభిషేకమౌ శిరము నం
దున్, పార్థలింగేశ్వరా !

5

మా యాప్తుండు కుటుంబరా వగు, నహో!
మల్లాది వంశ్యుండు, తా
డాయ న్నీ గుడి, పానవట్ట మది ఖం
డం బౌట దుఃఖించి, యా
పై యోచించి త్రిపీఠముల్ నిలుపగా
భావ్యమ్ముగాఁ దోచి, తా
నాయాసంపడి నిల్పె నట్టులను, దే
వా! పార్థలింగేశ్వరా!

6

కరణీయంబును దెల్పి యాతనిని చే
కట్టందిద్దె, నా యుద్యమం
బురుదీక్షన్ వహియింప నాశిషము సం
పూర్ణమ్ముగా నిచ్చుచున్;
వరణీయుండగు కామకోటి దొర, తా
వాత్సల్యమున్ జంద్ర శే
ఖరుడున్, యోగి, తపోధనుం డదియు నె
గ్గన్, బార్థలింగేశ్వరా!

7

విజయుం డీశ్వరు నిల్పె నిచ్చటని, సం
ప్రీతిన్ మహాభక్తితో
బెజవాడం గల వైశ్య సత్తముడు, నీ
వేశ్మమ్ము దర్శించుచున్
ప్రజలున్ మెచ్చగ, నాలయమ్మునకు భ
వ్యమ్మైన శోభాకర
ధ్వజము న్నిల్పెను గ్రొత్త వెలుగు నిడ, దే
వా ! పార్థలింగేశ్వరా !

8

ఐదునోమ్ముల మూడుఁ గన్నులను, నా
యందంపు జాబిల్లియున్
మీదన్, సుందర నాగముల్ దొడవుగా,
మేనన్ విభూతిన్ సదా
తాదాత్మ్య స్థితినుండియు న్నభయ హ
స్తమిచ్చు చిన్ముద్రతో
నాధారమ్మగు శాంతమూర్తి ! నతుల
న్నా ! పార్థ లింగేశ్వరా !

9

శూలంబున్ మఱియుం బరశ్వథము, న
స్తోక ప్రభం దాల్చుచున్
గేలం బాశము వజ్ర ఖడ్గముల న
గ్గిం బూనుచున్, జుంజురై
క్రాలుం జుట్టును చిమ్ముకొంచు, పునుకల్
కంకాళముల్ దాల్చుచున్
జ్వాలల్ గ్రక్కెడు నీదు రూప మొక డ
ప్పా ! పార్థ లింగేశ్వరా !

10

జటలున్ వ్రేలుచునుండ, మధ్యమున, నా
చంద్రుడు కాంతిన్, మహా
స్ఫుట మై హ్లాదము గొల్ప, శాంతమగు నె
మ్మోమున్, స్ఫురద్రూపమున్
వట వృక్షమ్మున నీడ, శిష్యులకు, నీ
వా దక్షిణామూర్తి వై
పటుతన్ బంచెదు తెల్వి మొత్తమును, దే
వా ! పార్థ లింగేశ్వరా !

11

తరుణంబైన వయస్సునన్నటుల వృ
ద్ధ చ్ఛాత్రులం గూడి, సుం
దరమౌ మఱ్ఱికి మూల భాగమున ని
త్య ధ్యాన చిన్ముద్రలన్
స్థిరమౌ మౌనము బూన, ఛిన్నమయి సం
దేహంబులున్ వారలున్
పరమానందము నోల లాడెదరు, దే
వా ! పార్థ లింగేశ్వరా !

12

ముదముం గూర్చెడి మూర్తి యొక్కడది, శం
భూ ! శంకరాచార్యమై,
వదలెన్ స్థాణుత, మౌనమున్, జటలనున్
పండింప ప్రజ్ఞానమున్ ;
కదలన్ శిష్యులు నాల్గు దిక్కులకు ని
క్కమ్మైన యద్వైత సం
పద, సందేశము నీయ దేశమున, దే
వా ! పార్థ లింగేశ్వరా !

13

కరిచర్మంబును పచ్ఛడంబుగ, వల
గ్నంబందు వ్యాఘ్రాజినం
బొరిమం దాల్చియు నంశుకమ్ముగ ను, న
త్యుత్సాహము నెన్నఁ ణమున్
గరము న్నిల్పగ నుండు నీ సొగసునుం
గన్నార వీక్షింపగా
హరి బ్రహ్మాదులు నిల్తురౌ వరుస, దే
వా ! పార్థలింగేశ్వరా !

14

వరణీయుండవు, సుందరుండవు, కృపా
కా కపర్దీ ! యన
శ్వరమౌ మూర్తివి, సర్వమంగళకు వి
శ్వాసమ్మునుం గూర్చు దే
వరవున్, జ్ఞాన సమాధి నిష్ఠుడవు, నె
వ్వారల్ నినుం బోల రో
హర ! నీ నామముఁ సర్వ పాపహర మౌ
రా ! పార్థ లింగేశ్వరా !



15

అందంబన్నది నీదె సౌమ్య, హరి తా
నార్జించెగా నాడుదై
పొందుంగోరితి వీవు మోహినిని, యా
పూబోడి యా చక్రియున్
సందించె, న్నటు బోక, నీ గుడిని యా
నందమ్మునం దేలగా
బంధించెంగదఁ పానవట్టముయి, య
ప్పా ! పార్థ లింగేశ్వరా !

16

సకలమ్మున్ సృజియించు నేర్పుగల ప్ర
జ్ఞాశాలియౌ బ్రహ్మయున్
సకలమ్మం బరిపుష్టి గూర్పగల ప్ర
జ్ఞాశాలియౌ విష్ణువున్
ఒకటే రూపము గల్గి వెల్గుదురు, నీ
వో ! రెండు రూపమ్ములన్
బ్రకటింపంబడి పూజలందుదువు, దే
వా ! పార్థ లింగేశ్వరా !



## 17

వేదంబుల్, మఱి, నాల్గు మోములను తా
విం గూర్చు నిశ్శ్వాసమై,
మీదౌ మోమున, కేవలమ్ము ప్రణవం
బే యుచ్చరింపంగ నౌ
నీదౌ మూర్తిని, తత్త్వముం, దెలిసెనే
గన్, మోక్షమౌ, వానికిన్;
లేదా, సంసృతియంధు వు  ఁడునహో !
శ్రీ పార్థ లింగేశ్వరా !

## 18

వేదంబుల్ మఱి మూఁటిమధ్యను యజు
ర్వేదంబునం, గాండలున్
ఐదున్‌రెండుల మధ్య భాగమున, నా
యై దక్షరాల్మంత్రమున్
బాదుంగొన్న ప్రశ్నశమందుననె, త
త్ప్రాణంబ నన్నిల్చు, స
ర్వాధిక్యంబున, నీదు నామము, ఘనం
బై, పార్థ లింగేశ్వరా !

19

కైలాసమ్మున సాంధ్యవేళలను, శం
ఖ మ్మాది నర్తింతు, వ
వ్వేళన్, మద్దెలవాడు శౌరి. మటి, దే
వేంద్రుండునుం బ్రహ్మయున్
మేలౌ పాత్రలు పాల్గొనంగ సభ, పే
ర్మిన్; జిన్మయానందపున్
శైలూషుండని, నిన్ను మెచ్చెద, రధీ
శా! పార్థ లింగేశ్వరా!

20

నీదౌ తాండవవేళ, నిత్యమును, వ
న్నెల్ జూడగా, వ్యాఘ్రపుం
బాదుం డచ్చటికిం బ్రయాణమగు ని
ప్రావీణ్య మీక్షింప; వే,
పాదంబుల్ మఱి లేని యట్టిడగు, స
ర్వాకారుడౌ మౌని, స
మ్మోదమ్ముం జను, నా పతంజలియు, ని
మ్మున్, బార్థలింగేశ్వరా!

21

మూండుం బాదము లున్న భృంగి సభలో
మోదించు, నిత్యమ్ము, నా
రెండుం గొమ్ములవాడు, నందియును, నా
రీణిం గడుం బ్రీతితో
నుండం, దంతిముఖుండు వారివలెనే
యుండున్, మహావేది, యు
ద్దండంబౌ గతి నాట్యమాడె, దెద హ
త్తన్, బార్థ లింగేశ్వరా!

22

నీ కావించెడి నాట్యమందున జటల్
నిక్కంగ, హస్తమ్మునన్
దూకుం ఝల్లరినుండి శబ్దము లహో!
తోతెంచు సూత్రమ్ములై
మాకున్ భిక్షగ; నంది, కారికల సం
పాదింప, శాండిల్యుడున్
జేకొంచున్ బరమార్థభాష్య మొసగున్
శ్రీ పార్థ లింగేశ్వరా!



23

సాయంవేళ త్రయోదశిన్, శివశివా, సా
ష్టాంగము, న్మ్రొకునై,
చేయన్ దొడ్డ మహాప్రదోషమున, మా
చిత్తాన నర్తింప, వే
బాయున్ బాపములెల్ల – నిన్వెదకినన్
బ్రత్యక్షమై నిలువొ
గాయత్రిన్, రవి, నగ్ని, నిశ్చయముగా
గన్, బార్థ లింగేశ్వరా!

24

ప్రతిమాసంబు చతుర్దశిన్, బహుళమౌ
పక్షంబు నందున్, మహా
యతపుణ్యంబునుఁ దెచ్చునట్టి దినమం
దత్యంతమౌ శ్రద్ధతో
కృతభక్తిన్, జలధార, నిన్ను నభిషే
కింపన్ జనుం డంత, దా
స్తుతిపాత్రమ్మగు నీదు సన్నిధినిఁ జెం
దున్, బార్థ లింగేశ్వరా!



25

భృగువారంపు బ్రదోషవేళలను నిన్
బ్రీతిన్ స్తుతింపంగ, నా
యుగజం గూడను, భక్తి గొల్చినటు, నీ
యర్ధాంగి యత్యంతమున్
భృగువారమ్మనె ప్రీతి చేసెడిని, నీ
వెంతేన్ బ్రదోషమ్ము, నొ
ప్పగ నానందము నాట్యమాడెదవు, దే
వా! పార్థ లింగేశ్వరా!

26

హేమంతమ్మున, మార్గశీర్షమున, స్వా
మీ! యార్ద్రనక్షత్ర మం
దేమో నీవు మతింత చల్లనయి, యెం
తే నార్ద్రమౌ గుండెతో
నోమంజూతువు భక్తకోటి నది మే
మూహించి, తాపంబు పో
బ్రేమ న్నిన్ను భజింతు మయ్యెడ కప
ర్దీ! పార్థ లింగేశ్వరా!

27

నీ చైతన్యమె నిండెనెల్లెడల, దా
నిన్ లింగ మంచున్, మహా
రోచిఃపుంజ మటంచు యోగిజను లా
లోకించుచు న్నాత్మలో
నా చిద్రూపము, భావన న్నధికమౌ
యానంద మాసించి, నిన్
యాచింతుర్గద మోచనమ్మునకు దే
వా! పార్థ లింగేశ్వరా!

28

శ్రేయంబున్, మఱియున్ సుగంధమును, బు
ష్టిం, గూర్చుచు న్నిత్యమున్
ధ్యేయంబైన త్వదీయమూర్తికిని, నా
ర్తిం, జిత్త మర్పించుచోఁ
బాయున్ మృత్యువు, జన్మమున్ రహితమౌ
ప్రాప్తింపగా చిత్సుధల్
నీ యాత్మీయపు జీవియై మసలెనే
నిన్! పార్థ లింగేశ్వరా!



29

నదులన్నింటికి సాగరమ్మొ గతియై
నట్టుల్, మహాదేవ ! పెన్
వ్యథనుం గుందెడి జీవరాశి కదిపో
వన్ మార్గమూహింప, నీ
పదముల్ దక్క శరణ్యమెయ్యదియు, ల
భ్యమ్మైనటుల్ లేదు, సం
పదలన్నింటికి నీవెమూలము తలం
పన్, పార్థ లింగేశ్వరా !

30

కెరటాలున్ శమియింప సాగరములో
కేగింతలై స్నాన మా
చరణంబుం బొనరింతునంట తగవో !
సంద్రానికిన్ సాజమౌ
కెరటాల్; లట్టులె యెప్పుడో నినుమదిన్
గీర్తింతు నం చాడుటల్
సరియే ? యాయువు శాశ్వతమ్మొ, పరమే
శా, పార్థ లింగేశ్వరా !



31

స్నానమ్ముం జపహోమముల్ సురలక
ర్చల్, సంధ్యలన్ యోగ్యమౌ
ధ్యానమ్ముల్, న్నతిథింభజించుటలు; ని
త్యం బాఱుకర్మంబులన్
చేసన్, లో, బరిశుద్ధుడై నరుడు, స్వా
మీ ! నిన్నుఁ బ్రార్థింప నా
దీనుం దోడనె రక్షసేయుదు కప
ర్దీ ! పార్థ లింగేశ్వరా !

32

పరమేశుండు విధించినట్టి పనులన్
బ్రాల్మాలి, వేఱొక్కటౌ
తరహాగా పనులన్ ఘటింప నవి వ్య
ర్థంబౌట తథ్యమ్ముల్, దే
వర పంపుం బనిజేయనొల్లకయు, దే
వా ! యంచు గీర్తించు కిం
కరునిన్, జేడునుఁ బ్రీతి చూచునొకొ బ్రమొ
క్కన్, బార్థ లింగేశ్వరా !

33

దేవున్ మంత్రప్రతిష్ఠ చేయు నెలవౌ
దేవాలయం బన్న, నా
దేవుం గొల్వగ నిత్య మొసటయు, నా
త్రిన్, ద్రవ్య మర్పించుటల్
జీవుండైన నరు . డు జేసినకదా
సిద్ధించు వాంఛల్, మహా
దేవా ! యూఱక గూరుచున్న ఫలమే
దీ ! పార్థ లింగేశ్వరా !

34

మూడుంగన్నుల మేటివేలుపవు, స
మ్మోదమ్ము సృష్టించితౌ
మూడుంగన్నుల నారికేళఫలమున్,
బోలంగ నీయాస్య; మె
వ్వాడుం, దత్ఫల సంచయు మ్మొసగు, న
వ్వానిం గృపాదృష్టి, నే
నాడుం జూతువు, భాగ్యశాలి యతడ
న్నా ! పార్థ లింగేశ్వరా !

35

వేరౌ క్షేత్రము లున్న పెక్కు, లవి, తృ
ప్తి న్నీయగా రామి, కా
శీ రామేశ్వరముల్ ప్రధానములుగా
సేవింత్రు భక్తాళి, యం
దౌరా! నీవె ప్రధానదైవతము, నీ
యందు న్మది న్నిల్పుచో
ధారాదత్త మొనర్తు జ్ఞాన మెద హ
స్తన్, బార్థ లింగేశ్వరా !

36

అభిషేకించిన నీదులింగమును, గం
గాంభస్సుతో, కాశిలో,
నభయం బిత్తువు నీవు మోక్షపురి యం
దత్యంతమౌ ప్రేమ, నీ
ప్రభలం జూచుచు నాత డచ్చట మహా
ప్రస్థానముం జేయుచో
నభవా! జన్మమునుండి ముక్తుడగు న
య్యా! పార్థ లింగేశ్వరా !

37

చెంది న్నీ సవిధమ్ము భక్తిపరతన్
శ్రీ కాళ హ స్తీంద్రముల్
చెందెం దిన్నడు, వారలే చదువునన్
శిక్షింపనైనార, లా
చందంబుంగన, భక్తియేకద, మహా
శాస్త్రుల సారం బహో!
బంధంబుం దెగగోయు కత్తియదె, యు
ప్పా! పార్థ లింగేశ్వరా!

38

అనిశంబున్ మతి భావనాకలితమై
నంతన్, దపంబై, యదే
మనము న్నిల్పును! నిత్యనిష్ఠగను, స
న్మార్గంబు జూపించు గా
వున, నీయందు మనంబునిల్పుటకునై
పూర్ణంపు యత్నంబు, చే
యను, జీవుండు భృశంబుఁ గోరవలె, న
య్యా! పార్థ లింగేశ్వరా!

39

నరుడుం జేసెడి కర్మ, తా, పురుష యు
త్నంబు, న్నదృష్టంబునన్
మఱియు న్నీదయతో ఫలమ్ము గను, నే
మాత్రమ్ము నీ మూటిలో
తిరకాసైన, ఫలమ్ము శూన్యమగు, నో
దేవా ! త్వదీయమ్ము, నా
దరమే ముఖ్యము మూడిటన్, ఫలమునం
దన్, బార్థ లింగేశ్వరా !

40

కాలంబున్, మతి, మంత్ర, దేవతలు, నౌ
గా, ద్రవ్యముం, గర్మకున్
మూలంబైనవి — యీశ్వరార్పణము, శం
భూ! కర్మలం జేయగా—
మేలై, శుద్ధియొనర్చు చిత్తమును, నా
మేలన్న, సామాన్యమా ?
మాలిన్యమ్ము గ్రసించునట్టి పని సు
మ్మా ! పార్థ లింగేశ్వరా !

41

చిత్తమ్మన్నను చంచలంబు, క్షణమున్
క్షేమంబుగా నుండ, దా
యత్తంబౌ, కడు దుష్టచింతనలకై,
యార్జించు పాపమ్ము, గ
మ్మత్తౌ యాశల, కోపమోహముల, సం
పాదించు మాలిన్యమున్
జిత్తమ్ము న్నిలగట్టెనేని శివుడే!
శ్రీ పార్థ లింగేశ్వరా!

42

అరిషడ్వర్గములన్ సృజించితివి కా
దా! యందు నొక్కొక్కరే
చిరముం దూరముచేసి జీవుని తప
స్సిద్ధిం బ్రతారింతు, రం
దఱినిం గెల్చుట కేరికైన తరమా!
దార్ఢ్యమ్మున న్నిల్వబో
తిరకాసయ్యెను గాధిసూతి మతి, యెం
తే, బార్థ లింగేశ్వరా!

## 43

కసరత్తు న్నియమమ్ముగా నొనరుపం
గాయమ్ము పుష్టిం గనున్
కసటుం గూర్చెటి దోషముల్ విడువగా
కావ్యమ్ము పుష్టింగనున్
పస నీయంగల ధర్మశాస్త్రమును తా
పాటింప యోగంబునై
పిసరం తైనను దుఃఖముంగలుగ దె
ప్డేన్, పార్థ లింగేశ్వరా !

## 44

ఏరోగమ్మునవైన బథ్యమది తా
నేర్పాటుగా నుండు, నా
యా రోగుల్ నడువంగ నట్టులె విధిన్
ఆరోగ్యముంగల్గు, సం
సారంబున్, జని. కూడ - రోగములెయౌ,
శాస్త్రోక్తధర్మమ్ము, లా
చారంబుల్ మఱి పథ్యముల్‌గద, యుమే
శా ! పార్థ లింగేశ్వరా !



## 45

ఆదర్శమ్మునఁ గల్మషమ్ము గలుగన్
అద్దాని బోద్రోయకే
లేదా దర్శనభాగ్య, మట్లె, తనువున్
లీనమ్మునౌ పాపమున్
ఏదా రీతి వ్రతమ్ములం గడుగనౌ
యేకర్మముం జేసినన్
నీదౌ ప్రీతిగఁ జేయుమేలగును దా
నిన్, బార్థ లింగేశ్వరా!

## 46

తెలివింబూనుచు చిత్తవృత్తిని నిరో
ధింపం దొరంకొన్న, లో
పలమాలిన్యము శాంతలక్షణము తో
బ్రక్షాళనంబందు, నా
వల, దైవమ్మును నమ్మికొన్న, నదియున్
బైనున్న యంతస్థులో
పలకున్, సద్గురురూపమై, తివియు, దే
వా! పార్థ లింగేశ్వరా!



47

చి త్తం బందున శద్ధికల్గ నదియే
చిల్లక్షణం బందుచున్
విత్తమ్మె మఱుజన్మకున్ మసలెడున్
వే గాన, నీ వట్టి నా
య త్తమ్మైన తపఃఫలమ్ము గనుచున్
ఆచార్యగా జీవికిన్
ద త్తంబుం బొనరింతు, జ్ఞానసుమ మం
తన్, బార్థ లింగేశ్వరా!

48

గురుడన్నం బరమేష్ఠి, నిన్ను, హరిగా
గుర్తించి పూజించినన్
గురుపూజామహిమంబు జెప్పఁదరమే!
కోటిం బ్రసాదించు, నా
గురుడే యల్గిన, రక్షసేయదగు ద
క్షుల్ లేరు లోకమ్మునన్–
గురుపాదమ్ముల, సర్వపాపములు బ్రుం
గున్, బార్థ లింగేశ్వరా!

49

ఏ వర్ణమ్మున సంచితంపు ఫలమై
యే జీవి జన్మించె, దా
నా వర్ణంపు విధానము న్నడువ, గృ
త్యంబుల్, ఫలంబుం గనున్
జీవుల్ గర్మల జేయజేయ తుదకున్
చిత్తమ్ము శుద్ధంబు నై
తోవం జూపును, జ్ఞానవర్త్మమున కెం
దున్, బార్థ లింగేశ్వరా!

50

నేమమ్ముల్ పరమేశ్వరాభిముఖమై
నేదిష్ఠము న్నిల్పగా
సామర్థ్యమ్మున నుండు, సాధకుడు, వ
ర్చస్సున్ గడించున్; జనుం
డా మార్గమ్మును హేళనన్ సలుపగా
నాయుస్సు క్షీణించు, నీ
ప్రేమం బొందగరానివాడయి చెడున్
శ్రీ పార్థ లింగేశ్వరా!

51

నేమమ్మున్ వహియించి ప్రాబలుకులన్
నిందింప కుండంగ, నే
యే మార్గమ్ములనైన బూని, నిను, సే
వింపన్ శుభంబౌను, వే
రే మార్గమ్ములవారి తూలిపలుకన్
రాదంచు,ము న్వ్యేత్త, లీ
భూమిం బల్కిరి,సత్య మియ్యదియు, శం
భూ ! పార్థ లింగేశ్వరా !

52

చలికి న్నోర్వదు,వేడి కోర్వదును,వ
ర్షమ్మున్ సహింపంగ, కే
వలమున్ శక్తముకాని, దేహమిది – యె
ఛ్ఛంగిన్ విచారించినన్
తులగా దోచును దీని వాలకము, నెం
తో శ్రద్ధ రక్షించుకో
వలయున్, నిన్ను భజించుకోసమయి, యు
ప్పా ! పార్థ లింగేశ్వరా !

53

ప్రతి జీవుండును శక్తి యుక్తులను సం
పాదించి, పుణ్యమ్ముకై
జతనమ్ముం బొనరింపం బాపతతియున్
శాంతి[illegible], పుణ్యమ్ములం
చితమౌ జ్యోతిగ వెల్గు, నంత యుగుపో
చిత్తంబు శుద్ధంబు, నా
వ్రతమూనన్నది, పోని పెట్టుబడి, దే
వా ! పార్థ లింగేశ్వరా !

54

చిత్త మ్మన్నది చంచలం బగుటయే
సిద్ధమ్ము, దానిన్ నినున్
హత్తంజేసి లయింపజేయుట, మహా
యజ్ఞమ్ము,త త్సాధనా
యత్తంబుం బొనరింప జూచుటకు, బు
ణ్యం బుంటయే కాక, నీ
చిత్త మ్మందు గృపారసమ్ము వలయున్
శ్రీ పార్థ లింగేశ్వరా !

55

వేదంబుల్ పఠియింప మేలగును, త్రై
విద్యుల్ సదా పూజ్యు, లీ
వేదాంతం బన నాత్మవిద్య, యిదియే
వెల్గుం బ్రసాదించి, ని
ర్వేదంబుం దొలగింప జాలునది; యా
వేదోక్తమౌ కర్మలా,
ప్రోదించేసెడి చిత్తశుద్ధి కయి, శం
భూ, పార్థ లింగేశ్వరా!

56

కనగా కర్మలె చాలు! నీశ్వరుడనం
గా నెవ్వ? డామూర్తి నే
లను బ్రార్థింప నటంచు; "దారుక"ను; బ
ల్కన్ మౌనులున్ గర్వమున్ -
జనియున్ భిక్షువు గాగ, వారి సతులన్
జక్కంగ, నానందముం
గన, నాకర్షణచేసి చూపితివి, ప్ర
జ్ఞన్, బార్థ లింగేశ్వరా!

57

వేదోక్తమ్మగు కర్మలందె శరులై
వేదాంతపుం దూరులై
వాదమ్ముల్ బొనరింప "దారుక" ఋషుల్,
భంగింపగా నీవు, నీ
మీదన్ మాంత్రికమైన హస్తి వదలన్
మేనుం ద్వరం జీల్చుచున్
కాదా తోలును గప్పికొంటి విది లె
క్కా ! పార్థ లింగేశ్వరా !

58

అజ్ఞానమ్మునఁ జేయు పాపములు, ది
వ్య జ్ఞాన సంపత్తికై
యజ్ఞంబుల్ బొనరింప, బో నడతు ర
య్యాదిత్యు లౌ వార, లా
ప్రజ్ఞావంతుల నాశ్రయించినను స
ర్వంబుం బ్రసాదింతు రౌ
విజ్ఞుల్ వారల పొత్తు గోరదగు తె
ల్విన్, బార్థ లింగేశ్వరా ,



59

నేల న్వ్రీడియు సాము చేయుట సుఖ
నిత్యమ్ము నా వేద, మీ
కాలంబందున లెక్క సేయకయె, ప్ర
క్కందారులం ద్రొక్కుటల్-
కాలం బన్నను బ్రహ్మమే యగుట, నె
క్కాలంబునన్ వేదముల్
మేలై, పూజ్యములై వెలింగెడిని, స్వా
మీ ! పార్థ లింగేశ్వరా !

60

ధనముం గోరును, దార గోరెడిని, పు
త్రి ప్రాప్తియుం గోరు, నీ
షణముల్ నాటికి నాడు బెంచుకొను, వి
స్తారమ్ము, లాభమ్ము లే
దనుచుం దానన, తా నెఱుంగడు కదా
తథ్యమ్ము పో కష్టముల్
మనమే హేతువు బంధ మోక్షముల కె
ల్లన్, బార్థ లింగేశ్వరా

61

బంధం బందున జిక్కి జీవు డటు లీ
ప్రాపంచికమ్మైన సం
బంధంబున్ విడలేక,యద్ది దృఢమై
బంధింప నంతంతకున్
రంధిన్, బాహ్యజగత్తు వైపునె కనున్
రాయిళ్ల పాలౌను, తా
సంధింపండు భవ త్పదమ్ము మది ని
చ్ఛన్, పార్థ లింగేశ్వరా !

62

ప్రాణంబుల్ బయనించుపట్టునను, స
ర్వంబున్ వృథాఁగా, మహా
దీనుండై పరిదేవనమ్మున మహా
ర్తిం గుందునే కాని, యా
ప్రాణా లుండ; వివేకశాలి యయి, నీ
పజ్జన్ మహాభక్తుడై,
ధ్యానంబుం బొనరింప డెట్టి పశువా
హా ! పార్థ లింగేశ్వరా !



## 63

ఉడుపుల్ ప్రాతవి వీడి నూతనములన్
ఉత్సాహముం దాల్చి కై
వడి, జీవుండును జీర్ణదేహమును దా
వర్జింప నౌగాని, గం
పెడు దుఃఖమ్మున వీడఁ బ్రాణములు, ప్రా
ప్తించున్ మహాదుఃఖమే ;
కడు ఘోర మ్మగు జన్మ కల్గు కనడా
గా ! పార్థ లింగేశ్వరా !

## 64

జననం బందిన జీవి చచ్చుట యనన్
సత్యంబు;నా సత్యమున్
మననంబుం బొనరింప, దుఃఖమది, సం
ప్రాప్తమ్ము కాబోదు, లో
తునకుం బోయియు చూచినన్, మృతిని బొం
దున్ సర్వమున్, పెద్దలన్
వినగా,నా యమృతమ్ము నీవె యీయది,
వే ! పార్థ లింగేశ్వరా !



**65**

నీకుం గుఱ్ఱలు బాహులేయుడును, వి
ఘ్నేశుండునుం; దారకున్
బోకార్చె న్నొకరుండు నీకె ప్రణవం
బుం జెప్పి మెప్పించె; బా
జా కాలమ్మున ప్రొల్తగా నొకడు న
ర్చ్యం జెందు నే కాలమున్
నీకుం బేరు గడించు వార లెటులే
నిన్, బార్థ లింగేశ్వరా!

**66**

దక్షుం డెంతొ వివేకశూన్యుడయి, ని
ద్దా గుండెతో యజ్ఞమున్
గక్షం బూనిన యట్లు ని న్విడచుచున్
గావింపఁ దా నెంతయో
దక్షుం డంచు దలంచి: దేవతలు, న
ద్దా నిన్ సహింపన్, జటన్
శిక్షం బొందిరి నీ క్రుధన్ సురలు ని
స్సీ! పార్థలింగేశ్వరా!



67

హుతభు గ్దైవత మౌచు, నగ్నిభవుకున్
యోగ్యమ్ము నౌ కృత్తికన్
వ్రతముం గొంచును బ్రార్థిమానిశి నినున్
బ్రార్థించుచున్, జీవు, డా
యతమౌ జ్యోతి రగుల్చు దాని వెలుగ
త్యంతమ్ము నౌ పాపమున్
హుతముం జేసెడి నెంత యౌనొ దయ యో
హో! పార్థలింగేశ్వరా!

68

చోటుంబెట్టితి వౌ, భగీరధునకున్,
స్రోతస్వినిన్ నీజటా
జూట మ్మందున పాయు తీయగను, న
చ్చో నుండి, గంగాఝురుల్
వాటమ్మైన హిమాలయమ్ము దిగి, సం
పాతమ్ము లై, నేలపై
దూటెన్, జీవుల పాపముల్ కడుగు నిం
దున్, బార్థ లింగేశ్వరా!



69

క్షీరాబ్ధిన్ జనియించు హాలహలమున్
జే యుండగా ఁజేసి, స్వీ
కారం బొనరింపకున్న, నదియున్
గాల్చున్ బహిర్లోకముల్
తీరా, మ్రింగః దహించు నద్ది, కడు నా
త్తిఁ బెండ, లో లోకముల్
"పూరా"గా గళబద్ధ చేసితివి, శం
భూ! పార్థ లింగేశ్వరా!

70

తనదౌ తాళి బలమ్ము గట్టిదని; ప్రో
త్సాహమ్ము జేసెం గదా
వనితారత్నము, గౌరి; లోకములకున్
బాధల్ నివారింప, నీ
వును స్తోత్రమ్ముల కుబ్బు లింగడవు, నీ
బోళాతనంబే కదా
కనగా, లోకపురక్ష, భిక్షయును మా
కౌ, పార్థ లింగేశ్వరా!



## 71

లయకాలమ్మున భస్మమే మిగులు, కా
ల్పన్ మాఱగా బోదు, దా
ని యదృష్టంబది: నీవుమై, నలదుటన్
నిన్జూచి భక్తాగ్రణుల్
నియతిం దాని ధరించి- పూతులయినన్,
నిష్ఠన్, విభూతిన్ గడున్
ప్రియముం గూర్తువు వారికిన్ సతతమున్
శ్రీ పార్థ లింగేశ్వరా !

## 72

నిత్యంపుం బ్రళయమ్ము నిద్ర: సుఖము
న్నిచ్చున్, సదా, జీవికిన్
సత్యమ్ముం గన, నట్టిదే లయ మహో,
సాజాత్య మౌ రెంటికిన్
అత్యంతమ్ము భయ మ్మదేలనొ లయ
మ్మన్నన్, మహానిద్ర నీ
వత్యంతమ్ము సుఖమ్ముగూర్పు, లయక
ర్తా ! పార్థ లింగేశ్వరా !



73

గంగం బ్రుంగగలేదు, కాశి మొగమున్
గానంగ లే దక్కటా!
సంగాతమ్ములు జూడ పెక్కులు! మహా
సంసార పాథోధిలో
బ్రుంగ న్నిట్టులు నట్టులుం గెరటముల్
ముంచెత్తు, తాడించు, నే
గంగం, గాశిని, నిన్నుగా తలతు భ
ర్గా! పార్థ లింగేశ్వరా!

74

లింగాకారము దాల్చి నీవయిని వ
ల్లింపన్ మహాన్యాసమున్
గంగం బోసెద నుత్తమాంగమున, నీ
కంటెన్ ఘనుం డెవ్వడు
ప్పొంగం జెంబెడినీళ్ళతో, హరహరా!
పూరింతు శంఖమ్ము, ఖం
ఖంగు న్నాద మొనర్ప నొత్తెదను బా
కా! పార్థ లింగేశ్వరా!





75

ద్రోణం, బర్హము, జేలయున్, పఃటియునున్
దుత్తూరము, న్మృత్తియున్
సూనంబుల్‌గొని, నీ శిరస్సుపయి, సం
శుద్ధమ్ముగ నా భక్తిమై
ఏనాడైనను పూజసేయుదునొ స్వా
మీ ! నాయెడన్ నీకు ,స
బైనన్, గొంతకు గొంత జాలియుగు న
య్యా ! పార్థ లింగేశ్వరా !

76

శైలూషుండవు, నీకుఁ బ్రీతియగు నా
శైలూష పత్రంబులన్
వాలాయమ్ముగఁ బూజసేతు మదిలో
భావించి, భావించి, దృ
గ్జాలం బించుక పర్వి నా యెడను, పం
చారింపవే, వెల్గు మొ
త్తాల, న్మచ్చపు తెల్వివెన్నెలలు హ
త్తన్, బార్థ లింగేశ్వరా !



77

గండాగొండితనమ్మున, నొకట, నె
గన్వచ్చు, వాదమ్ములో
బాండిత్యమ్మున నెగ్గవచ్చు నొకచో-
భావించి, నిన్నున్నదిన్,
శాండిల్యమ్ము నొకండు నీ శిరము; న
ర్చం జేయు పూతాత్మ వా
గ్భాండాగారమునందు వ్యర్థ మవియౌ
గా ! పార్థలింగేశ్వరా !

78

మాలూరమ్ము ధరింతు రౌ సుర లహో
మాల్యమ్ముగా-బిల్వమున్
జాలం భక్తిని నీకొసంగ నది, కు
షవ్యాధి బోకార్చు, సు
శ్రీలం గూర్చును శ్రీఫలంపు దళమున్,
జింతింప, మారేడుకున్
జాలంజాలినదేది? నీకు ప్రియ మీ
శా, పార్థ లింగేశ్వరా

## 79

నానాజీవులు కర్మబద్ధు లగుచు
న్నారల్, విచారింపగా
నానాగర్భములం జనించినను, నా
నందమ్మె మూలమ్మ నో-
ఆనందమ్మున పూర్ణతం గనగల
క్ష్య మున్న చో వారికిన్
నీ నామమ్మె శరణ్య మెన్నటికి నే
నిన్ బార్థ లింగేశ్వరా!

## 80

ఆనందమ్మె నిజస్వరూప మగుటన్
ఆనందమే కోరెడిన్
ఏనాడైనను జీవి, కాని, యదియున్
ఏ మార్గముం గల్గునో
పూనం డట్టి పథమ్ము వెంట నడువన్-
బోవు న్విరుద్ధంపు మా
ర్గాన, న్నెక్కడి కేగునో తెలియడా
రా! పార్థ లింగేశ్వరా!

81

మమకారమ్ము నహంకృతి న్వదలి, స
న్మార్గంబునన్ బోవగా
క్రమముం దోచును మేను వేరనుచు, చె
క్కం దెల్వి వీక్షించినన్-
శమపున్‌లక్షణ మెల్ల పూర్ణమగుచున్
సంద్రమ్ము గాగా, నదే,
యమృతత్వం బగు, మోక్షమయ్యెదియె, దే
వా! పార్థ లింగేశ్వరా!

82

లఘువుల్ రెండిటి బల్కగా సులభమౌ
లాభమ్ము చేకూఱు, నా
యఘముల్ మారణహోమ మయ్యెడును, వి
ద్యా బుద్ధులుం గల్గు, నా
మఘవుం డైనను దాసుడౌను, శివ నా
మం బుచ్చరింపంగ, నెం
త ఘనిష్ఠం బయి శక్తి మత్తయినదో,
తా, బార్థ లింగేశ్వరా!

83

కాముండే కద జన్మకారణ, మటుల్
కాలుండౌచున్ మిత్తికిన్-
కాముం దగ్ధము జేసితీవు, జమునిం
గాలెత్తి తాడించితో;
ఏముం బుట్టుట గిట్టుటల్ గడువ, ని
న్నే యాశ్రయింపన్ వలెన్
సామీ! జీవుల నుద్ధరింపగదె యా
స్థన్ బార్థ లింగేశ్వరా!

84

శివుడే దైవము, జ్ఞాన మన్న శివుడే
చిద్రూపుడై, జ్ఞానమున్
బవలున్ రాతిరి భక్తకోటికిని సం
ప్రాప్తింపగా జేసెడిన్
శివుడే మోక్షము, మోక్షదాతయును నా
శ్రీ కంఠుడే, లే దహో
శివు కంటెన్ మఱి భిన్నమైన యదియున్
శ్రీ పార్థ లింగేశ్వరా!

85

శివ ! యన్నంతనె మంగళమ్ము కలుగున్
జేకూఱెడిన్ సంపదల్
తవ నామమ్ము సదా స్మరించుచును, సం
ధ్యావేళ నె జీవుడేన్
స్తవముం జేసిన, చిత్తశుద్ధి కలుగున్,
జ్ఞానమ్ముఁ బ్రాప్తించు, నో
శివ ! నీ నామము సర్వసిద్ధికరమౌ
శ్రీ పార్థ లింగేశ్వరా !

86

పరమానందపు ముద్ద యైన నిను సం
భావించి, యంత, న్నిరం
తరముం దైలపుధార వోలె మనమున్
ద్వ ల్లగ్నముం జేయగా
వరముం గోరెద, నీవె నా మనమునున్
బంధించి నీవైపు,స
త్వరముం, జిందుము, నీ కృపారసము, దే
వా !పార్థ లింగేశ్వరా !

87

నిన్నున్ భావన చేయచేయ, నెడగా
నీ కోయి, నీ రూపమున్,
అన్నా! చిత్తము, వేరు కావలసినన్,
అత్యంత ఖేదమ్మున
బన్నంబందెడి నట్టి దౌస్థితిని, సం
పన్నంబు నుం జేయుగా,
నిన్నుం జేఱగ గోరెద న్నెటుల గా
నీ, పార్థలింగేశ్వరా!

88

నిన్నుం గోరకయున్న దోచదుకదా
నీవున్ వరా లిత్తువం
చెన్నో, నీకు, కితాబు లుండెనుకదా!
యేమందు, దాక్షిణ్యమో
యన్నా! భక్తుల కేది కావలయునో
యా మాత్రము న్నేఱవే?
నిన్నుం గొంచెము సేయుటే యడిగినన్
నే, పార్థ లింగేశ్వరా!



89

ఏనాడైన, బ్రదోషకాలమున, స్వా
మీ ! నిన్ను దర్శించినన్
ఆనాడే శివరాత్రిగా మనమునం
దారోపమై, నిస్తుల
ధ్యానం బందున, నిల్చిపోవు గతి, సం
ధానింపవే, వే, కృపన్
జ్ఞానానందమయ స్వరూప ! పరమే
శా !పార్థలింగేశ్వరా !

90

తనకేదో మఱి లేదటంచనెడి చిం
తన్ బ్రమ్గు నే జీవియున్
జని యున్నంతన, చింత యుండునుకదా !
జన్మంబె లేకుండగా
చేనినన్, జింతయుఁ బోవు దాన, నటు,లీ
శా ! జన్మమే లేని, ని
న్నునె, భక్తిం భజియింతు బ్రోవగదె, న
న్నుం, బార్థ లింగేశ్వరా !





91

పరిశీలింపగ స్వర్గలోకమున దే
వాధీశు డౌ వాడు, సం
బరముం బొందెడునట్టిదౌ సుఖము, చె
ప్పన్ లేశమౌ పోల్పు, నా
పరమానంద పయోధి తోడ, నదియుం
బ్రాప్తించుఁ దా బ్రహ్మమం
చెఱుగన్ తత్త్వము, దానికిన్ దయయు నీ
దే! పార్థ లింగేశ్వరా!

92

పండీపండని దోస, దాని తొడిమన్
బట్టుం గదా, గట్టిగా,
పండం గు ర్తగు, మోక్షణమ్మొ లతతో-
భావింపగా నట్టులే,
యుండున్ మృత్యువునుం జయించు వానికగు నా
యు[?]ం బ్రపంచించుచో
పండుం దెల్వియు, బంధనము [?]డిపో
వన్, పార్థ లింగేశ్వరా!



## 93

తిథులున్, మాసము, లంత, వత్సరము, లు
ద్వేగమ్ముగా నేగు, నా
గదు కాలమ్ము, గభస్తి తోడ నడచున్
కాయమ్ము నెవ్వేళ నుం
డదు పోషించిన శాశ్వతమ్ముగను, బెం
డై పోవు నానాటికిన్
ముదియున్ రాకయె, నిత్య, మొక్కవలె, ని
న్నున్, పార్థ లింగేశ్వరా !

## 94

తరణం బన్నది దుస్తరంబగును య
త్నంబైన, సంసార సా
గరముం బోలినదేది? తెప్ప లెవ్వియుం
గావన్న దక్షంబు,లో
హర ! నీ నామమె సర్వ దక్షమయి యా
యబ్ధిన్ దరింపింపగా
శరణంబై, దరి జేర్చగా గలుగు, నో
జన్, పార్థ లింగేశ్వరా !

## 95

ఆలుంబిడ్డలు చుట్టపక్కములు, వ
హ్వా ! మన్మలం గూడియున్
చాలంజాలగ చుట్టబెట్టుకొను, ని
స్సారంపు సంసారమున్
వాలాయం బయిపోవ, జీవికి ఫలం
బడ్డటి యీగం బలెన్
జాలం గొట్టుక లాడు, నిన్ను గన డ
న్నా ! పార్థ లింగేశ్వరా !

## 96

వసనమ్ము, న్నశనమ్ము గిము జలమున్
వాంఛించు జీవుండు, న
వ్వసముం, దా సుఖముండు పొంటె, సవియ
బ్బన్ బుణ్యలేశమ్మునన్;
కసుమాలంపు బనుల్ ఘటించుగద ! యే
కాలమ్ము నీ మూర్తి మా
నసము న్నిల్పడు, వట్టి, వ్యర్థుడు గద
న్నా ! పార్థ లింగేశ్వరా !

97

తెలవాఱున్, మఱి, ప్రొద్దుగ్రుంకు నిదియే
తీరౌ, దినమ్మన్న; నా
తెలవాఱంగనె తిండియత్నమగు, బూ
త్రిం జెందగా, నిద్రయున్
బలు మార్గంబుల నైన భోగరతియుం
భావించు జీవుండు, బు
ద్ధి లగింపఁడు, భవ త్పదాబ్జముల, నా
ర్తిన్, బార్థ లింగేశ్వరా!

98

జీవుం డించుక పుణ్యకర్మమును దా
జేయంగ నొల్లండు, కా
నీ, వాంఛించును పుణ్యకర్మఫలమౌ
నిండౌ సుఖమ్మున్, వృథా
కావే, కాంక్షలు ; కర్మ లేక ఫలముల్
గమ్యమ్ము లౌనే ? మహా
దేహా! కానడు గాక సత్య మిది, బు
ద్ధిన్, బార్థ లింగేశ్వరా!



99

ఊరు న్వాడల యోగి పుంగవులు, తా
మూరేగ, దత్సన్నిధిన్
జేఱంబోవు నరుండు నాశపడి, కా
జేయంగ దత్పుణ్యమున్
తేరంగా నగు కార్యసిద్ధి యని, యం
తేకాని, తా నొచ్చు, నే
తీరుం బుణ్యము నాచరింపడు కప
ర్దీ! పార్థ లింగేశ్వరా!

100

అనయమ్మున్ వినయమ్ము దాల్పగల వి
ద్య న్నేర్వగా బోడు, త
ద్వినయం బించుక లోపమైన, నహముం
బెంపొందు కొండంతగా
చెనునే యట్టి యహంత లోన బెఱుగన్
సవ్యంపు మార్గంబునన్
నిను జేఱంగ జనుండు, వ్యర్థుడవకు
న్నే? పార్థలింగేశ్వరా,





## 101

వెన్నుం గాచుక యుండు విఘ్నము, లహో !
వేల్వేలు, శ్రేయస్సు నుం
బన్నంబుం బొనరింపగా, నియమముల్
బాటించు వానిన్ సదా౽
పన్నుం జేయుగ, వానినిం గడచినన్
బాధల్ నివర్తించి, సం
పన్నం బయ్యెడు, నాత్మ, సుస్థితికి దే
వా , పార్థ లింగేశ్వరా !

## 102

చెందు న్నింద్రియపున్ సుఖమ్ము పశు వౌ
చింతింపగా, మానసా
నందం బన్నది చెందబోవ దది, నా
నా విద్యల న్నేర్చి, యా
నందంపుం గతియుం గ్రహించియు, నరుం
డత్యంత హీన స్థితిన్
బంధంబే వరియించు గృత్యముల, న
ప్పా! పార్థ లింగేశ్వరా !





103

ఉన్నం దానిని, దిద్దనేర్చు, నటుగా
కూహించి, తా మానవుం
డెన్నం డైనను సృష్టి చేయ గలడే,
యే వడ్లగిం జేసియున్ ?
అన్నా ! నీ యదె సృష్టి, నీ కొసగకే
యాతండు భక్షించినన్
గన్నంపుం బని చేసి లాగికొను దొం
గా ! పార్థ లింగేశ్వరా !

104

భూమిం బుట్టును పెక్కు లైనవి మహా
భూజమ్ములున్, వానికిన్
భూమిన్ బోషణముండు, శుష్కమగుచో
భూమిం గ్రసింపం బడున్
ఏ మాత్రమ్ము విచారణన్ సలిపినన్
ఏ భూమి యీ సృష్టికిన్
ధామమ్మో, యదె కారణమ్ము లయమం
దన్, పార్థ లింగేశ్వరా !



105

సుకముం గోరును జీవుడెల్లపుడు నో
ర్చ్చం దాని సంతోషుడై ,
అకముం గోరడు జీవు డెప్పుడును, ఎ
హ్వా! దుఃఖముం జెందెడిన్
అకటా ! తట్టుకొనంగ జాల డెటులే
న ద్దానినిం దట్టుకో
సుకరంబైన, మనీషియౌ, కనెడు నీ
శున్, పార్థ లింగేశ్వరా !

106

స్థూలమ్మున్, మఱి, సూక్ష్మ కారణములై
శోధింపగా మేను లా
ప్రోలు ల్వోలెను, జీవు గప్పునః; క
ల్లోలంబునుం, జేసెడిన్
కూలం ద్రోయుము, తెల్వియల్గుల, హరా
కూల్పంగ నీ వట్టులన్
వాలాయమ్ము సుఖమ్మె, తా, మిగులు, న
హ్వా ! పార్థ లింగేశ్వరా

107

ఎటు జూడన్ బుడమిన్ సముద్రమై యగున్
ఎంతెంతయో చెప్పరా
నటు జుట్టెన్ వలయమ్ముగా గ—నదికా
నం, దోచెడిన్ సత్య, మొ
క్కటి, నీవు స్మృతి జీవుల న్నటులుగా
గాఢమ్ముగా నావరిం
చుట—దానిం దెలియుంగ సర్వమును తో
చున్, బార్థ లింగేశ్వరా !

108

జడమై యుండిన సర్వమౌ ప్రకృతి
చైతన్య ముం జేసి, తా
జడముం గానటు దోచుచున్న దది వో
సంభ్రాంతినిం గొల్పు, నో
మృడ ! నీదౌ కృప జ్ఞాన మబ్బ, నదియే
మించున్ ప్రకాశించి యీ
జడతం బాపును జీవరాశికిని పె
ల్చన్, బార్థలింగేశ్వరా !



**109**

వరుస న్నిల్పుచు నిల్వుటద్దముల సొం
  పారంగ వీక్షించు చో
వరుస న్నందఱు నాత్మమూర్తు లటనుం
  బ్రత్యక్షమై నిల్తు, రా
వరుసం జూడగ, నొక్క దైవతమె, వి
  భ్రాంతిన్ సహా కొల్పు, సం
దఱిలో నుండుచు తానె, యెంతొయగు విం
  తై, పార్థ లింగేశ్వరా !

**110**

ఉన్నట్లుం గనిపించి, లేని దగుటన్
  ఒజ్జల్ పరీక్షించి, తా
మన్నా ర్మాయ యటంచు దాని, నదె, సు
  మ్మా! చూపు, నానాత్వమున్
ఎన్నన్ వేఱొక టంచు లేదు కద! యె
  న్నో సార్లు చర్చించినన్
అన్నా! యున్నది యొక్కటే, యదియు, నీ
  వౌ! పార్థ లింగేశ్వరా!

## 111

అంతా మిథ్య యటంచు బల్కెదరు వే
దాంతుల్, మహాసత్య, మా
వంతైనం గన c బొల్లు లే, దనుభవం
బై, వచ్చుటే క్లిష్టమా
ధ్వాంతమ్మున్ దొలగించి, నీవు, కరు ను
ద్దామంపు దాక్షిణ్యమున్
స్వాంతమ్మున్ బరిశుద్ధి చేయకయె, దే
వా ! !పార్థ లింగేశ్వరా !

## 112

చెనుసే కేవల బుద్ధితో నరయగా
సంపాద్యమా యాత్మ వి
ద్యను, చిత్తంబున బక్వమైన దశ సం
ధానించినం గాక, తా
మనమున్ బిట్టు ధృఢంబు జేసికొని, స
మ్యగ్జ్ఞాన సంపత్తి చే
ననుభూతిన్ లగియింపగా వలయు ప్ర
జ్ఞన్, బార్థలింగేశ్వరా !

**113**

అమిత మైన వ్యయమ్ము జేయుచును, తా
నాడంబరుం డౌచు, వ్య
ర్థముగా ప్రాణుల హింస జేయుచు, పరా
ర్థం బేమియుం జూడకే
క్రమ బద్ధంబగు జీవనమ్మునకు, దూ
రంబౌనతండు, సం
యమి కానేరడు,నీకు దూరుడగు, న
హ్హా ! పార్థ లింగేశ్వరా !

**114**

లయ మన్నన్ భయ మందుచంద్రు, జనులు
ల్లాసంబు జూపింప, రా
లయమే లేకయె యున్న సృష్టి ప్రజకే
రాజ్యమ్మునుం జాల, ద
ద్దియునుం గాకయు, చొప్పదంటు వలె, వ
ర్తించున్ జగ మ్మారయన్
లయకారుండగు నీకు మ్రొక్కవలె కే
లన్, పార్థ లింగేశ్వరా !



115

లయముం జేతువు లోకముల్ ప్రళయ కా
లం బందునన్, సృష్టికిన్
లయమే, పూర్వపుటునికి; భస్మ మగు టె
ల్లన్ లోకముల్ సాజమౌ,
లయ మందున్ వెలుగొందుదీవు, కడు, ను
ల్లాసంబునన్ మించి, య
వ్యయతన్, దాండవకేళి సల్పెదవు, దే
వా ! పార్థ లింగేశ్వరా !

116

తెలియ న్నేరని వాడ ! వట్టి పశువున్
దేవుండ, వీవాడు; మేల్
తెలియం జెప్పిన నేర్తు నో పశుపతీ !
తెల్విం బ్రసాదింపు, మా
వల నా నేర్చిన భంగి నిన్ను గొలుతున్
భావింతు నశ్రాంతమున్
పులకింపంగను మేను నీదయను, శం
భూ ! పార్థ లింగేశ్వరా !



**117**

ఎన్నేన్ జేయు శివాపరాధముల, స్వా
మీ! నన్ను శిక్షింప, నే
నె న్నే జన్మల నెత్తగా వలయు గా
నీ! దొడ్డ వాత్సల్యమున్
మన్నింపం దగు నోయి నన్ను, నగుచో
మ ద్భాగ్య మేమందు, బెన్
సున్నాలై చను నెట్టి పాపముల రా
సుల్! బార్థ లింగేశ్వరా!

**118**

తప్పుం జేయని మానవుం డెవడహో!
దానం, జిరం బాతడున్
జిప్పం జేతను బట్టి పోవలెనె! గా
సిం జెందగా జూచెదే!
అప్పా! సూనుని వోలె జూచుకొని, స
వ్యంబైన మార్గంబునన్
ద్రిప్పంగా వలెగాక! వేరు గలదే!
శ్రీ పార్థ లింగేశ్వరా!

119

ఒకడౌ తత్త్వము, భిన్నమౌ విధములన్
ఊహింప వీలయ్యె నం
బికయున్, విష్ణువు, నీవు, నొక్కటె కదా!
వేర్వేరు రూపాల, నొ
ద్దికమై భక్తుల తాప మూడ్చెదరు, బు
ద్ధి నిల్ప నెచ్చోట నేన్
వికసించు న్మతి, తత్త్వమ్మ మగు నె
ప్డేన్, బార్థ లింగేశ్వరా!

120

రుచు లన్నన్ బహుళమ్ములై యెసగు నీ
లోకమ్మునన్ జీవులున్
రుచినిం బట్టియు మూర్తి కల్పనము, దా
రుం జేయుచుం బూజలన్
బచరింపంగను, తత్త్వ మొక్క టగుటన్,
భర్గా! నినుం జేఱ నా
రచనల్, భక్తియె సాధనమ్ము నిను జే
ఱన్, బార్థ లింగేశ్వరా!

## 121

కలిలో బంచసహస్రముల్ గడచి, దు
ష్కాలమ్ము ప్రాప్తించినన్
కల రీ నేలను, చంద్రశేఖరులు, యో
గమ్మందు, త్వ ద్రూప ని
శ్చల మూర్తుల్, కరుణాంతరంగులు, మహా
సాధుల్, మహావిద్య శి
ష్యులకున్ బోధ యొనర్తు, వారికినమ
స్సుల్! పార్థ లింగేశ్వరా!

## 122

### శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామి.

శ్రీ చరణులు 20-6-1894న దక్షిణఅర్కాట్ మండలమున విల్లుపురములో జన్మించిరి. మాతృభాష కర్ణాటము. పూర్వాశ్రమ నామము శ్రీ స్వామినాథన్. పదమూడవ ఏట 13-2-1907 న సన్యాస దీక్షను స్వీకరించి కంచికామకోటి పీఠమునకు అఱువది యెన్మిదవ ఆచార్యులైరి. 1964 నుండి 1969 వరకు నాంధ్రప్రదేశ సంచారము చేసిన సందర్భములో 30-4-67న శ్రీవారికి శ్రీ వేంక టేశ్వరాలయ ప్రాంగణమున వజ్ర కిరీటము సమర్పింప బడిన సందర్భమున, వారి సమక్షమున పఠింపబడి సమర్పింప బడిన పద్యములను, తరువాతి పుటలలో చూడనగును. ఈ యాత్ర సందర్భముననే స్వామివారికి కురుక్షేత్ర నిధికై అఱువది వేల రూప్యములు సమర్పింప బడెను. ఏలూరులో 9-1-1963న స్వర్ణ రుద్రాక్ష కిరీటము సమర్పింప బడెను.



వెలుగు వెల్లువ పొంగి విజయవాటిక నేడు
ముంచెత్తె నో పుణ్యమూర్తులార!
కంపా హ్రదమ్ము, దిగ్గన లేచి కృష్ణమ్మ
నాశ్లేష మొనరించె నయ్యలార!
ఏకామ్రనాథుండు నీ మల్లికార్జున
స్వామి యొక్కం డయ్యె భక్తులార!
కంచి కామాక్షమ్మ; కనక దుర్గాదేవి
భావమ్ము పొందె, నో, భక్తులార!

కనులు తెఱచిన కోటిలింగాల వెలుగు
కనులు మూసినఁ గన్పించు కామకోటి
దివ్యచరణమ్ము లిది మన దివ్యఫలము
తలచుకొనిన, నదృష్టవంతులము, మనము.

## 2

భక్తకోటికి గొంగుబంగరు, కానిచో
ప్రజ లిచ్చు పుష్పముల్ వారికేల
రుగ్మతల్ ద్రోచు కారుణ్యమ్ము – కానిచో
ప్రజ లిచ్చు ఫలరాశి వారికేల
ఆశ్రమధర్మమే యని కాని, లేనిచో
ప్రజ లిచ్చు భైక్ష్యమ్ము వారి కేల
ఆర్తుల రక్షించు నట్టి దీక్షయె కాక
పద సంచరణ వృత్తి వారి కేల

తులసి మాలలు, మఱియు, నిస్తులపు వజ్ర
రాసులను నొక్క రీతి శిరమ్ము నందు
నిలిపి, భక్తుల నెల్ల తృప్తులను జేయు
చంద్రశేఖరు నెన్నంగ సమయు నఘము

3

తన మేను, మంచిగందపు చెక్కగా నీశ్వ
రార్థంబు నర్పాది హాయనములు
నరగఁదీసిన జీవి,యు ల్లాశనుండును
నల్ప నిద్రాశాలి, యమృతవాక్కు
అక్షిగోళమ్ము, గామాక్షి నిల్పిన మహ
ద్రష్టయు, వేదవిత్తముడు మిపుల
చంద్రమౌళీశు నర్చావిధి నద్వయా
నం దానుభూతిని నొందుఘనుఁడు

శంకర ప్రతికల్పుడు, చంద్రశేఖ
రేంద్ర సద్గురుమూర్తి, తా, నెల్ల జనుల
కోరికలదీర్చు, శ్రీ కామకోటి స్వామి
తరమునం జీవు డుండ మే ల్తరముగాదె!

4

సేదంపు పరిరక్ష వేదాంతులకు భిక్ష
నొసగెడి, యొక మేటి యజ్ఞ యగుచు
శాస్త్రమ్ములకు రక్ష, ఛాత్రులకును శిక్ష
గఱపెడి యొక మహాగురువు నగుచు
ఆగమ శిల్పాదు లగు కళలకు నండ
దండి విద్యల కెల్లఁ గొండ యగుచు
గో జాతికిని మహా గోవర్ధన మ్మౌచు
పేదల పాలిటి పెన్నిధి యయి

మోహనమ్మైన యాదర్శ మూర్తి యగుచు
తనదు సన్నిధినిఁ బవిత్రతావిభూతి
భక్తకోటిని నలరించు భవ్యమూర్తి
చంద్రశేఖరు దివ్య వర్చస్సు గొలుతు.

## 5

అమ్మవారికి గాడ్పు చుమ్మలు తగులునో
యని, వట్టివేళ్ళ వ్యజనమ్ము తడుపు
అయ్యవారికిని బిల్వార్చన వేళలం
దళశుద్ధిఁ బరికింపుఁ దానె శ్రద్ధ
అమ్మవారికిని ఁబూజార్థమ్ము సుమములం
గాలి లేక యుండఁగఁ గోరి వెదకు
అయ్యవారికిని క్షీరాభిషేకపు వేళ
ధారలో నేకాగ్రతను భజించూ

భక్తి రూపమ్మునెత్తిన పరమమూర్తి
విశ్వ మంతయు నిండిన వెలుగు రాశి
కనుల గట్టును చంద్రశేఖర గురుండు
శిష్యమూర్తి ద్వితీయుడై చెలువు లొలికి

6

ఒకప్రక్కనుండి, తా, నుఱుక వచ్చినయట్లు
దీనుల కష్టముల్ దెలిసి కొనుచు
ఒక చెక్కి వచ్చి, తా గోపాలం గమనించి
యవసరమౌ సలహాలఁ జెప్పు
ఒక చాయ వచ్చి తా నుజ్జ్వలమ్ముగ దివ్య
దర్శన మ్మిచ్చు భక్తాళి కెల్ల
ఒక వంక వచ్చి తా నొక వీక్షణముతోనె
యర్థుల తాపమ్ము లణచివేయు

పరమ కారుణ్య మూర్తియౌ పరమగురుని
సన్నిధిని తృప్తుడై కాంచిన దెవండు
ప్రజల కా దర్శన మ్మొక్క రాజయోగ
మరసి చూచిన చంద్రశేఖరుని నెలవు.

## 7

కైలాసపతి లోక కల్యాణమునకునై
వదలెను శంకర స్వామి యనుచు
కుమతాటవుల వాద ఘోరకుఠారమ్ము
చెండి తుండెమ్ములఁజేసి విడచె
కాశ్మీరు మొదలుగా, కన్యాగ్ర మవధిగా
చల్లెను జ్ఞాన బీజములు, వెలుగ
బీజరక్షణకునై, పీఠముల్ నెలకొల్పె
చిచ్ఛక్తి యందు ఘనీభవింప

భరతదేశమ్మె సర్వ ప్రపంచమునకు
దివ్యసందేశ మిచ్చెడి తేజ మెచట
వెలిచె,నా జ్ఞానపీఠమ్ము దెలిసికొనుడు
ఆర్షమతమై భవమ్ము లోకాతిశాయి.

## పునర్దర్శనము

(11 – 10 – 82)

మఱలం జూచితి చంద్రశేఖరుని, యీ 'మాగాము' నందున్, నిరం
తరముం బ్రహ్మమునందు నిష్ఠనొక సత్రమ్మందు నే మూలనో
పరమానందమునుం భజించెడి, తపః పారీణునిన్, మౌనినిన్
పరమాశ్చర్యకరమ్ముగా వెలుగు శుభ్రజ్యోత్స్న పోనిం ద్యుతిన్

2

వారిని జూడగా వరె గవాక్షము నుండియొ, లోన నుండి, యే
తీరికవేళనో, వలపు తెవ్వెత్తర, గమ్మను రీతి వత్తురా,
సారెకు సారెకుం జనులు వాగిలి మ్రొక్కి ప్రసన్ను లౌచు, శ్రీ
వారును, వారలన్ బరమ వత్సలతన్ గని మింతు రెంతయున్

3

ఆ యాత్మీయత జూపు వీక్షణము ల త్యానంద పూర్ణమ్ముగా
ఆ యాత్మీయత నొల్కు భాషణము లే యందు వినన్ రాని వై
త్రియందీయుగ నుండి, భక్త తతికిం దెల్విం బ్రసాదింపగా
నే యందున్ గనరాని దౌ, యనుభవ మిచ్చోటనే గాంచనా.

4

పారావారము దాటి యిచ్చటికి నా పై దేశికుల్ వత్తు, ర
వ్వారల్ భక్తుల రీతిని న్నుడుపులన్ వాంఛించి యుందాల్చి, శ్రీ
వారిం, దూరమునుండియే గనుచు, సద్భక్తిన్ నతుల్ సేతు, రే
పారం దృప్తియు, వారు, నయ్యదె మహా భాగ్యమ్ముగా నెంతురా.

5

వారలకెట్టి దర్శనము స్వామి యొసంగునొ, విచ్చునట్టి యా
నీరజ ముంబలెం గనుల నీక్షణ జేతురు, బాష్పవారినిన్
గోరను గీరి కొందు, రతి గోప్యమునౌ సుఖముం భజింతు, శ్రీ
వారును లోని కేగ, దరి బట్టని దుఃఖమునం దపింతురౌ.

6

కన్నాకుంబలె గాచియుండునని యొక్కండన్న, నా స్వామి, మా
పెన్నుంగాచియె యుండునంచు బలుకున్ వేఱొక్కడు, న్నాం డౌరుల్
సన్నంగా నటు చెప్పికోగ బహుభాషా భాషు, లచ్చోట సం
పన్నంబైన ప్రశాంతి, వారి యెదలో భాసించు నవ్వేళలన్

7

లయబద్ధమ్ముగు గానమున్, భజనలన్ రాపాడ రే యెల్ల నుం
ప్రియమై భక్తులు, స్వామి సన్నిధిని, వారిం ప్రేముడిం జూచుచున్
దయతోడన్ శ్రవణమ్ము జేయుచును, నిద్రన్ జెప్పరానీక, తా
నియమించున్, ముని, యావయస్సునను, దానిన్, యోగనిష్ఠం గడున్

8

ఎచ్చటి వారు వచ్చి, సొదలెల్లను వారికి జెప్పికోగ, వా
రచ్చపు శాంతమూర్తియయి, యాదరము న్విను నంత, తృప్తితో
వచ్చిన వార లేగెదరు, వారల స్వామియు సాగనంపి, తా
నచ్చపు వెల్గుగా మిగులు, నాంతరమైన తపః ప్రభావమున్

9

మాయురె! భక్తితో, తులసి మాలలు, మారెడుటాకు మాలలున్
ఈయుగ, వాని, శీర్షమున, నెంతయు హర్షమునన్ ధరించెడిన్
ఈయుగ గంగ శిరంబుజళి! యురార్వరుధాతి శిరస్సునిల్వ, జే
బోయుగ బిల్వ బీజములు, పూతములంచును జేర్చునక్కటన్

10

అచ్చటి కేగువాడు ముని యాగ్రహమున్నది చూడబోడు, తా
ముచ్చట గొల్పు నిగ్రహమె మోదము జూచు, ననుగ్రహమ్మునన్
సచ్చరితుండునా నదియు శాంతతరంగిణి, దాని జూచినన్
స్వచ్ఛత జెందు నెందు, భగవంతుడు స్వామి యనంగ దోచెడిన్

("మాగాము" గ్రామము కర్ణాటక రాష్ట్రములో గుల్బర్గా సమీపమున నున్నది. అచ్చట నొక దేవమందిరమున కను బంధముగనున్న సత్రమందు శ్రీవారు కొంతకాలముండి, తిరిగి యాంధ్రదేశసంచారముచేయుచు, కర్నూలున తమ తొంబదవ సంవత్సరములో (1983) శిష్య ప్రశిష్యులతో చాతుర్మాస్యదీక్ష బూనిరి.

## శ్రీ శ్రీ శ్రీ జయేంద్ర సరస్వతీస్వామి

శ్రీవారు 1935లో తంజావూరు మండలస్థ "ఇరుళ్ళనీకి"లో జన్మించి, కామకోటి పీఠమున కఱువది తొమ్మిదవ ఆచార్యులుగా 19-3-55 న ఆశ్రమ స్వీకారము గావించిరి. మాతృభాష తమిళము. పూర్వాశ్రమ నామము శ్రీ సుబ్రహ్మణ్య అయ్యర్.

నేదిష్ఠమ్మున రాజ్యపాలకుడు నా నేపాల భూపాలుడున్
పాదమ్ముల్ భజియింప, భారతమునన్, భ్రాంతమ్ము
భ్రాంతమ్ము నా
వేదోక్తమ్మగు ధర్మమున్ వినిచె, నా పీఠమ్మున న్నెట్టిదో
బోధల్ జేసె, జయేంద్ర తాపసి, కళాపూర్ణుండు నుత్సాహియున్

